# మనపదులు

[భాగం 3]



రచన:

రెంటాల గోపాలకృష్ణ



ఆదర్శ గ్రంథమండలి, విజయవాడ.

ప్రథమ ముద్రణ :
ఆగస్టు 61

ముద్రణ :
'వెంకటరత్నా'
విజయవాడ -2

వెల : 0-87



## ఇందులో

ఛేంబల్

సబర్మతి

నర్మద

తపతి

మహీనది

లూనీనది

దామోదర్

మహానది

# ఛేంబల్

యమునానదికిగల ముఖ్యఉపనదులలో ఛేంబల్‌నది ఒకటి. ఈ నది 20ం.27'ఉ. అక్షాంశ, 75ం.31'తూ. రేఖాంశలమీద, సముద్రమట్టానికి సుమారు 2019 అడుగుల ఎత్తున వున్న జనపాల్‌కొండల్లో జన్మించింది. మహౌకాంటోన్మెంటుకు నైఋతిదిశగా సుమారు తొమ్మిదిమైళ్ళ దూరాన వున్నది ఈ ప్రదేశం. ఛేంబల్‌నది వింధ్యపర్వతాల ఉత్తరపుటంచులగుండా ప్రవహించి, ఉత్తరదిశగా, మధ్యప్రదేశ్, రాజస్థాన్‌లగుండా పోతున్నది. చాంబ్లా, శిప్రా అనే నదులు దీనికి ముఖ్యఉపనదులు. ఇవికూడా వింధ్య పర్వతాలలోనే పుడుతున్నాయి. ఇవికాక — కాలీసింద్, మేజ్—అను మరో రెండు చిన్ననదులుకూడా వచ్చి ఛేంబల్‌నదిలో కలుస్తున్నాయి.ఈ నది ప్రవహించేమార్గంలో గ్వాలియర్, ఇండోర్, సిటమావ్ రాష్ట్రాలున్నూ, ఝాలావర్‌హొలిమేరలున్నూ తగులుతాయి. రాజస్థాన్‌లో ఈ నది పటార్‌పీఠభూమిగుండా పోయి, కొన్నిమైళ్ళతరవాత భైన్‌సరోర్‌ఘర్‌వద్ద చిన్నచిన్న సెలయేరులుగా మారుతుంది. అనేక జలావర్తాలనూ—సుడిగుండాలనూ ఏర్పరుస్తుంది. ఈ నది బుందీ, కోటాలమధ్య సరిహద్దును ఏర్పరుస్తున్నది. కోటానగరసమీపాన ప్రవహించి, ఇంకా ఈశాన్య దిశగా పోతున్నది. ఈ పట్టణం దాటినతరవాత దక్షిణదిశ

నుండి కాలీసింద్ అను ఉపనది వచ్చి—ఈనదిలో కలుస్తు న్నది. పశ్చిమంనుండి మేజ్‌నది వచ్చి చేరుతున్నది. అటు పైన పార్వతి అను మరోనది వచ్చి కలుస్తున్నది. కోటా నగరం దాటినపిమ్మట నది, ఏటవాలుగా వున్న పర్వత ప్రదేశాలగుండా పోతున్నది. రాజస్థాన్‌లో బనాసనదికూడా వచ్చి దీనితో చేరుతున్నది. ధోల్‌పూరువద్దకు పోయేటప్ప టికి—పర్వతప్రాంతమంతా పోయి, మైదానాలలో ప్రవేశి స్తుంది. అక్కడ, ఎండాకాలంలో నదివెడల్పు సుమారు 300 గజాలు మాత్రమే. కాని వానాకాలంవచ్చేటప్పటికి నది నిండా నీరువుంటుంది: దాదాపు వెయ్యిగజాలదాకా వెడల్పు పెరుగుతుంది. గంటకు 5.5 మైళ్ళవేగంతో ప్రవహిస్తుంది. ఈ ప్రాంతంలో అనేక కనుమలు, లోయలు ఏర్పడ్డాయి. ఇవన్నీ బందిపోటు దొంగలకు నివాసంగా వుంటున్నాయి. తరవాత ఛంబలునది ఉత్తరప్రదేశ్‌లో ప్రవేశించి, ఇటావా అనేపట్టణానికి ఆగ్నేయమూలగా సుమారు 25మైళ్ళ దూరంలో యమునానదితో కలిసిపోతున్నది. యమునతో కలిసినతరవాతకూడా కొద్దిమైళ్ళదూరం—ఈనది ప్రత్యే కంగానూ, స్పష్టంగానూ గుర్తించడానికి వీలుగా కనుపిస్తూ వుంటుంది. నదీజలాలు చాలా స్వచ్ఛంగా, స్ఫటికాల్లా వుంటాయి. యమునానదీజలాలు అలాకాక, మాలిన్యంతో కూడి చాలా మురికిగా ఉంటాయి. ఛంబల్‌నదిపొడవు సుమారు 650 మైళ్లు. కాని—జన్మస్థానమగు జనపావ్

కొండలనుండి—యమునానదిలో కలిసే ప్రదేశంవరకూ—సూటిగా చూస్తే, దూరం 330 మైళ్ళుమాత్రమే.

ఈనదిని ఛేంబల్ అనీ, చంబల్ అనీ—పలువిధాలుగా పిలుస్తారు. ఒకే పర్వతసమూహంనుండి చంబర్, చంబేరా, గంభీర—అను మూడు నదీప్రవాహాలు బయలుదేరివచ్చాయనికూడా అంటారు. ఈ ఛేంబలునదినే మన పురాణాలూ, ఇతిహాసాలూ చర్మణ్వతీనది అని పేర్కొన్నాయి. మహాభారతంలో ఆది, అరణ్య, ద్రోణ, శాంతిపర్వాలలోనూ, పద్మపురాణంలోనూ, కాళిదాసు మేఘసందేశంలోనూ ఈ నది ప్రసక్తి వచ్చింది. పాణినికూడా ఈ నదిని వర్ణించాడు.

భాగవతం నవమస్కంధంలో ప్రసిద్ధమగు రంతిదేవోపాఖ్యానం వర్ణితమై ఉన్నది. దుష్యంతుని కుమారుడగు భరతుడు భరద్వాజుని పెంచుకున్నాడు. అయితే, భాగవతానికి వ్యాఖ్యకారుడగు శ్రీధరస్వామి చెప్పినప్రకారం-ఈ భరద్వాజుడే వితథుడనురాజు. వితథునికుమారుడు మన్యు. ఆ మన్యుకు అయిదుగురు కుమారులు. బృహక్షత్రుడు, జయుడు, మహావీర్యుడు, నరుడు, గర్గుడు—అనేవారు. వీరిలో నాలుగవవాడగు నరుడికుమారుడు సంకృతి. ఆ సంకృతికి ఇద్దరుపుత్రులు. మొదటివాడు గురుడు, రెండవవాడు రంతిదేవుడు. రంతిదేవుడు గొప్ప దైవభక్తుడు, పుణ్యాత్ముడు, మహాదాత అని ప్రసిద్ధి కెక్కాడు. ఇది 'నాది' అని ఆయన అనుకోడు. ఎవరు

ఏది అడిగితే - అది లేదనకుండా ఇచ్చేవాడు. ఇలా ఆ రాజు అడిగినవారికి అడిగినదల్లా ఇస్తూవుండగా కొంత కాలానికి ఆయనవద్ద ఏమీ లేకుండాపోయింది. అన్నం, నీళ్లుకూడా లేవు. ఆవిధంగా ఆయన పచ్చి గంగకూడా పుచ్చుకోకుండా నలభై అయిదురోజులు కటికిపస్తులున్నాడు. అంతట ఆయనకు కొద్దిగా అన్నం దొరికింది. కాని ఆసమయానికే ఒక అతిథి వచ్చాడు. అన్నంలో సగం అతిథికి పెట్టాడు రంతిదేవుడు. తక్కినసగం తాను తినబో తుండగా అప్పుడు ఒక శూద్రుడు, ఒక చండాలుడు, ఒకరి తరవాత ఒకరు వచ్చారు. వారికికూడా అన్నం పెట్టాడు రంతిదేవుడు. ఇంకా కొద్దిగా అన్నం మిగిలింది. అదైనా తిని ప్రాణంనిలుపుకోవాలనుకున్నాడు రాజు. అంతలో ఒక కుక్క ఆకలితో నకనకలాడుతూ వచ్చింది. ఆ కాస్తా దానికిపెట్టి తాను అలాగే ఉండిపోయాడు రంతిదేవుడు. అప్పుడు బ్రహ్మాదిదేవతలు తమతమ నిజరూపాలలో అక్కడ ప్రత్యక్షమైనారు. పరీక్షించడానికి తామే ఆవిధంగా వచ్చామని చెప్పి రంతిదేవుని వరంకోరుకోమన్నారు. 'నాకే రాజ్యాలూ, సంపదలూ వద్దు. సదా విష్ణుభక్తి కలిగి ఉండేటట్లు నాకు వరం అనుగ్రహించండి'—అని వేడుకు న్నాడు రంతిదేవుడు. దేవతలు అలాగే వరంఇచ్చి వెళ్ళి పోయారు.

రంతిదేవుడు ఎన్నెన్నో యజ్ఞయాగాది క్రతువులుచేసి

అడిగినవారికి అడిగినట్లు దానాలూ, దక్షిణలూ ఇచ్చి దేవతలనూ, సమస్తభూతకోటినీ తృప్తిపొందించాడు. ఒకప్పుడు రంతిదేవమహారాజు యాగంచేస్తూఉండగా అక్కడికి అనేక గోవులు వచ్చాయి. మనుష్యభాషణాలతో— 'రాజా! నీ యాగంలో మమ్మ 'వ్రేల్చవలసినది'—అని వేడుకున్నాయి. కాని గోవులను యజ్ఞంలో వ్రేల్చడానికి సంశయించాడు రాజు. అప్పుడు గోవులు—'రాజా! దేవతలు పంపగా మేం వచ్చాం. దీనివల్ల నీకు పాపంలేదు. పుణ్యమే వస్తుంది'—అని మళ్ళీ చెప్పాయి. చివరకు రంతిదేవుడు అందుకు అంగీకరించాడు. 'మీలో ఏఒక్కగోవు అయినాసరే, యాగంలో వ్రేల్చబడడానికి సంశయించినట్లయితే—నే నీయాగమే మానేస్తాను'—అని చెప్పాడు. తరవాత ఆ గోవులన్నింటినీ వ్రేలుస్తూ గొప్ప యాగం చేశాడు. ఆవిధంగా యజ్ఞంలో మరణించిన గోవులన్నీ గోలోకానికి చేరాయి. యాగంచేసినస్థలంలో గోవుచర్మం గుట్టలుగుట్టలుగా పడింది. వాటిమధ్యనుండి గోవులరక్తం ప్రవహించింది. ఆ ప్రవాహమే ఒక పుణ్యనది అయింది. ఆవిధంగా ఆ నదికి చర్మణ్వతి అని పేరువచ్చింది. చర్మణ్వతినదియే ఇప్పుడు మనం పిలుస్తున్న ఛేంబల్‌నది.

రంతిదేవుడు చాలా ధర్మంగా పరిపాలించినట్లు భాగవతం చెపుతున్నది. ఆయన గొప్ప పుణ్యాత్ముడనీ, ఎన్నెన్నో యాగాలుచేశాడనీ మహాభారతం చెపుతున్నది.

మహాకవి కాళిదాసు తన మేఘసందేశంలో గంభీరా, చర్మణ్వతి (ఛంబలు) నదులను వేర్వేరుగా వర్ణించాడు. [మేఘసందేశం—ప్రథమసర్గ, 44,45 శ్లోకములు] యక్షుడు మేఘుడితో గంభీరానదిని చూచి, పరామర్శించి మరీవెళ్ళమని చెపుతాడు. ఈ నది చాలా లోతుగావుంటుందనీ, స్వచ్ఛమైన జలంతోకూడి మనోహరంగా కనుపిస్తుందనీ, ఆ నదిమీది నుంచి వచ్చే గాలి చల్లగా, పరిమళభరితమై ఉంటుందనీ చెపుతాడు. తరవాత అదేసర్గలో 49 వ శ్లోకంలో కాళిదాసు ప్రత్యేకంగా చర్మణ్వతినదిని వర్ణించి చెప్పాడు.

'వ్యాలమ్బేథాః సురభి తనయాలమ్భజాం
మానయిష్యన్
స్రోతోమూర్త్యాభువి పరిణతాంరన్తి దేవస్య
కీర్తిమ్—'

[మేఘ—ప్రథమసర్గ, 49]

పూర్వం గవాలంభనంచేసిన రంతిదేవమహారాజు యొక్క యజ్ఞగోవుల సంబంధమగు చర్మాలు, రక్తం ప్రవహించి, నదిఅయింది. దాన్నే యిప్పుడు చర్మణ్వతి నది (ఛంబల్) అని పిలుస్తున్నారు. రంతిదేవమహారాజు కీర్తియే ఈనదీరూపంలో ప్రవహించింది. దివ్యలోకంలో వుండే కామధేనువునుండి జన్మించింది ఈ నది. మేఘుడా! నీ వా నదిని తప్పక దర్శించి, వినమ్రుడవై సత్కరించి మరీ వెళ్ళు'— అని యక్షుడు మేఘుడితో చెవుతాడు.

వర్షాకాలంలో ఈ నదిలో పుష్కలంగా నీరు ఉన్న ప్పటికీ—దీనిని సక్రమంగా ఉపయోగించుకోడం జరగడం లేదు. ఈ నది ప్రవహించే భూమి మిక్కిలి సారవంతమైనది. అంతేకాదు, గొప్ప ఖనిజసంపదగల భూమి ఇది. అయితే, నదిమార్గం చాలా లోతుగా ఉండడంవలన ఈ జలాలను నీటిపారుదలకు ఉపయోగించుకోడానికి ఎక్కువగా వీలులేకపోతున్నది, ప్రభుత్వంవారు ఎంతో పరిశోధన జరిపి—ఇందుకోసం క్రీ.శ. 1946—47లలో 'ఛేంబల్ వ్యాలీప్రాజెక్టు'ను తలపెట్టారు. ఈ పథకంప్రకారం నది మీద మూడుచోట్ల ఆనకట్టలు నిర్మిస్తారు. ముఖ్యంగా నది 70 మైళ్ళదూరం సన్నని అగాధంగుండా ప్రవహించే ప్రదేశంలో వీటిని నిర్మిస్తారు. ఈ ప్రాజెక్టు మధ్యప్రదేశ్, రాజస్థాన్ రాష్ట్రాలకు సరిహద్దుప్రదేశంలో ఉంటుంది. కొటావద్ద బ్యారేజీకూడా ఒకటి కట్టి—అక్కడనుంచి కాలువలు-తీయడానికి ఆలోచనలు జరుగుతున్నాయి. ఆనకట్టలుకట్టేచోట జలవిద్యుచ్ఛక్తిస్థావరాలనుకూడా ఏర్పాటు చేస్తారు. ఈ పని యావత్తూ మూడుదశలలో పూర్తి చెయ్యాలని అంచనావేస్తున్నారు. మొదటిదశలో మధ్యప్రదేశ్లో నదికి 'గాంధీసాగర్ డాము'న్నూ 770 మైళ్ళ దూరం పోయే ట్రాన్సిమిషన్లైన్సుతో 'గాంధీసాగర్ పవర్ స్టేషను'న్నూ, పంటకాలువలతోసహా కోటావద్ద ఒక బ్యారేజీనిర్మాణమున్నూ — పూర్తికావాలని చురుకుగా

పనులుసాగిస్తున్నారు. ఈ ప్రాజెక్టు పూర్తిఅయితే—మధ్య ప్రదేశ్, రాజస్థాన్ రాష్ట్రాలలో దాదాపు 11 లక్షలఎకరాల భూమి నీటిపారుదలక్రిందికి వస్తుంది. 75 వేల కిలోవాట్ల విద్యుచ్ఛక్తికూడా లభ్యంఅవుతుంది.



# సబర్మతి

మనదేశంలోని పుణ్యనదులలో సబర్మతీనది ఒకటి. దీనికి సభ్రమతి, స్వభ్రావతి, చందన—అను పేర్లుకూడా ఉన్నాయి. ఈనది మేవాడ్‌కొండలలోని నందిపుండ్ అను ప్రదేశంనుండి బయలుదేరివస్తున్నది. ఆ కొండమీద మీర్ పురావద్ద ధన్‌బారు అనే సరస్సు ఉన్నది. ఆ సరస్సునుండే జన్మిస్తున్నది ఈ నది. అక్కడ దీనిని సబర్ అని పిలుస్తారు. ఆరావళికొండలనుండి ఇది నైఋతిదిశగా మళ్లుతుంది. పిమ్మట అర్బుదశిఖరం (మౌంట్‌ఆబూ) దాటి చివరకు పశ్చిమానవున్న కాంబేసింధుశాఖలో పడుతున్నది. సబర్మతీనదిపొడవు సుమారు 200మైళ్లు. దీని పరివాహ ప్రదేశం దాదాపు 9500చ.మైళ్ళు. సబర్‌నది హత్మతీనదిని కలిసినతరవాత సబర్మతి అను పేరుతో పిలువబడుతున్నది.

సబర్మతి అను పేరురావడానికి పురాణగాధ ఇలా తెలుపుతున్నది. సంభ్రమము—అంటే ఒకవిధమైన కలవరమూ, భీతి. పూర్వం ఒకప్పుడు వశిష్ఠమహర్షి ధ్యాననిమగ్నుడైవుండగా ఆయనఎదుట విశ్వామిత్రుడు కనుపించాడు. అప్పుడు వశిష్ఠుడు మిక్కిలి సంభ్రమంతో విశ్వామిత్రునివంక చూచాడు. ప్రబలమూ, మహాతీక్షణమూ అయిన వశిష్ఠుని చూపులకు భూమిలో రెండు రంధ్రాలు ఏర్పడ్డాయి. ఆ రెండురంధ్రాలనుండీ రెండునదులు పైకి

ఉబికివచ్చాయి. అవి సరస్వతి, సబర్మతి అనుపేర్లతో ప్రసిద్ధికెక్కాయి. ఆవిధంగా వశిష్ఠుని సంభ్రమమగు చూపులనుండి జన్మించింది కాబట్టి దీనికి సబర్మతిఅని పేరు వచ్చింది. ఈనది అంతులేనిజలంతో ఉండి, కొండలు అడ్డు రాగా - ఏడుపాయలుగా చీలిపోయినట్లు మరొక పురాణ గాధవలన తెలుస్తున్నది.

సబరత్మీనది అహమ్మదాబాదుజిల్లాగుండా ప్రవహించి త్రోవలోఒకవైపు సౌరాష్ట్ర,కచ్ భూములనూ, మరొకవైపు తక్కిన గుజరాత్ప్రాంతాన్నీ తాకుతూ - తుదకు కాంబే సింధుశాఖలో కలుస్తుంది. అహమ్మదాబాదునగరం యీనదీ తీరంలోనే ఉన్నది. యీ నది ఇంచుమించు మహాగుజరాత్ మధ్యగుండా పోతున్నది. ఖారీ, మేష్వా, మజ్హామ్, షెల్వా, అంధారీ - మొదలగు చిన్నచిన్ననదులు సబర్మతికి ముఖ్యఉపనదులు. యీ నదులన్నీ ఉత్తరగుజరాత్నుండి బయలుదేరి - కాంబేసింధుశాఖను చేరుతున్నాయి. ఇవికాక భోగవా, భాదర్, ఉతవాలీ, నిల్కా, పింజరియా, అధియా- అను సౌరాష్ట్రానికిచెందిన నదులన్నీ తూర్పుదిశగా ప్రవహించి చివరకు అవికూడా కాంబేసింధుశాఖలో కలుస్తున్నాయి. ఉత్తరదిశకు పోయినకొద్దీ యీనదికి ఇరుదరులా చాలా ఎత్తయిన కొండరాళ్లు మిక్కుటంగా కనుపిస్తాయి. వర్షాకాలంలో యీ నదినిచూస్తే జలంతోనిండిపోయి ఎత్తయిన కొండరాళ్ళమధ్యనుంచి ప్రవహిస్తూ అత్యంత మనో

హరంగా అగుపిస్తుంది. నదీముఖద్వారానమాత్రం ఇరు దరులూ ఎత్తుతగ్గిపోయి, ఇసుకమయంగా ఉంటాయి.

సబర్మతినిగురించిన పురాణగాధలు అనేకంవున్నాయి. కశ్యపమహర్షి అర్బుదశిఖరంమీద (మౌంట్ ఆబూ) అనేక సంవత్సరాలు శంకరుణ్ణిగూర్చి తపస్సుచేశాడు. శంకరుడు మెచ్చి - తన జటాజూటంనుంచి గంగనుతీసి ఆ మహర్షికి ఇచ్చాడు. ఆ గంగ నదిగాప్రవహించి - కాశ్యపిగంగ అనుపేరుతో ప్రసిద్ధిచెందింది. ఈ నది ఒక్కొక్క యుగంలో ఒక్కొక్కపేరుతో ఉన్నట్లు తెలుస్తున్నది. కృతయుగంలో కృతావతీ అను పేరుతోనూ, త్రేతాయుగంలో గిరికర్ణికఅనుపేరనూ, ద్వాపరంలో విద్యుమతిఅను పేరుతోనూ, కలియుగంలో సబర్మతీఅనుపేరుతోనూ విలసిల్లినట్లు పురాణగాధ చెపుతున్నది. ఈ నదీతీరాన—ఇరు దరులా దాదాపు ఎనభై ఎనిమిదివేలమంది మహర్షులూ, మునులూ తపస్సుచేసినట్లూ, ఆశ్రమాలుకట్టుకుని నివసించినట్లూ పురాణాలవల్ల తెలుస్తున్నది. అందువల్ల ఇది చాలా పుణ్యప్రదమైననది, అనేకఉపనదులను కలుపుకున్నతరవాత ఇది వాఘపూర్, వారోసిడా, సాద్రా, వాసనా, పెటాపూర్, అహమ్మదాబాద్, వావుధా — మొదలగు పట్టణాలపక్కనుంచి ప్రవహిస్తున్నది. సబర్మతికిగల ముఖ్యఉపనదులలో మేష్వానది ఒకటి. ఈ నదితీరాన ఖిలోడాఅనే గ్రామంవద్ద ప్రసిద్ధమగు ప్రాచీనదేవాలయం

ఒకటివున్నది. అది శ్రీకృష్ణాలయం. ఈ తీర్థాన్ని గదా ధరపూరీతీర్థం అని పిలుస్తారు. యీ ఆలయం మహారణ్యాల మధ్యలో ఉన్నది. అత్యంత ప్రాచీనమూ, శిల్పసౌంద ర్యమూ కల దేవాలయం ఇది. ప్రతిసంవత్సరం కార్తీక శుద్ధ పూర్ణిమలగాయతూ పదిహేనురోజులపాటు ఇక్కడ స్వామివారికి గొప్పఉత్సవాలు జరుగుతాయి. యీ ప్రాంతం లోనే ధృతరాష్ట్రునిభార్య గాంధారీ, ఆమెనూరుమంది కుమాళ్ల కౌరవుల విగ్రహాలూ వున్నాయి. సబర్మతి వుప నదులలో మరొక ముఖ్యమైన వుపనది హత్మతినది. యీ నదీతీరాన హిమ్మత్‌నగరం అను పట్టణం వున్నది. పూర్వపు ఐదర్‌రాష్ట్రానికి ఇది రాజధాని. ఇది క్రీ.శ. 1426లో అహ మ్మద్‌షాచేత నిర్మింపబడింది. అప్పుడు దీనిపేరు ఆమ్ నగర్. ఐదర్‌రాష్ట్రానికి అసలురాజధాని ఇల్‌దుర్గం. పోతే- హర్‌నావ్ లేక హిరణ్యాక్షినదిఒడ్డున ఖేడ్‌బ్రహ్మ అనే క్షేత్రం వున్నది. ఇక్కడ నాలుగుముఖాలతోవున్న బ్రహ్మ విగ్రహమూ, ఆ సమీపంలోనే అంబఆలయం వున్నాయి. బ్రహ్మదేవునికిగల ఆలయాలు రెండేరెండు. ఒకటి పుష్కర క్షేత్రంలోనూ, రెండవది ఖేడ్‌బ్రహ్మలోనూ వున్నాయి. ఇక్కడ పూర్వం ఒకప్పుడు బ్రహ్మ గొప్ప యజ్ఞంచేశాడట. బ్రహ్మమానసపుత్రుడగు భృగుమహర్షి, బ్రహ్మ రుద్రులను అవమానించి, ఆ పాపపరిహారార్థం ఇక్కడ తపస్సు చేశాడు. యీ నదిలో స్నానంచేసి పాపంపోగొట్టుకున్నాడు.

ఈ క్షేత్రంలో ప్రతిసంవత్సరం మాఘ బహుళ చతుర్దశి లగాయతూ పది హేనురోజులపాటు బ్రహ్మోత్సవాలు జరుగుతాయి. ధోల్కా పట్టణానికి ఎనిమిదిమైళ్ళదూరంలో వావుధా అనేగ్రామం ఉన్నది. ఈప్రదేశంలోనే ఏడునదీప్రవాహాలు వచ్చి ఒకచోట కలుస్తాయి. ఈ ఏడునదీప్రవాహాలూ-సబర్, హత్మతీ, ఖారీ, మజ్‌హామ్, మేష్వా, వ్రతాల్, షేధీ— అనేవి. ఏకీర్ణతీర్థం అనుచోట - సభ్రమతి, సేతికా, వల్కినీ, హిరణ్యమయీ, హస్తిమతీ, వేత్రమతీ, భద్రముఖీ—అను ఏడునదులు ఏకమవుతాయని పద్మపురాణం చెపుతున్నది. వావుధాగ్రామంలో ప్రతిఏటా కార్తీకపూర్ణిమ మొదలు అయిదురోజులపాటు ఉత్సవాలు జరుగుతాయి.

సబర్మతీతీరానవున్న అహమ్మదాబాదునగరం గొప్ప నగరం. పశ్చిమభారతంలో గొప్ప పారిశ్రామిక, వ్యాపార కేంద్రం. మహాగుజరాత్‌లో ప్రధానపట్టణాలలో ఒకటి ఈ నగరం. పూర్వం అన్హిల్వాదపట్టణాన్ని పాలించిన సోలంకి వంశీకుడగు కర్ణదేవమహారాజు ఈ ప్రదేశంలో కర్ణావతి అను నగరాన్ని నిర్మించాడు. దీనినే శ్రీనగరం అనీ, రాజనగరం అనీ కూడా అంటారు. క్రీ.శ. 1411లో సుల్తాను అహమ్మద్‌షా తనపేరులో ఇప్పుడున్న అహమ్మదాబాద్ నగరాన్ని ఇక్కడ నిర్మించాడు. ఈ ప్రదేశంలో కుందేళ్లు, వేటకుక్కలను తరమడం సుల్తాను చూచాడట! ఈ ప్రదేశం శౌర్యపరాక్రమాలకు నిలయంఅని గ్రహించి ఆయన

ఇక్కడ యీ పట్టణాన్ని నిర్మించాడు. తనకు రాజధానిగా చేసుకున్నాడు. యీ సుందరనగరం—భూదేవిముఖాన ఒక చక్కని పుట్టుమచ్చగా వర్ణించబడింది. తరవాత క్రీ.శ. 1486లో మహమ్మద్ బెగడా యీ నగరాన్ని బాగు చేయించి పునరుద్ధరించాడు. ముసల్మానులపరిపాలన అంత మయినపిమ్మట యీ నగరం పీష్వాలచేతుల్లోకి వచ్చింది. ఆపైన బ్రిటిషువారిఅధీనమైంది. ఇక్కడ వర్తకులు గొప్ప ఐశ్వర్యవంతులనీ, 'జగత్ సేఠ్' లనీ ప్రసిద్ధిపొందారు. యీ ప్రాంతంకూడా ప్రాచీనకాలంనుండీ గొప్ప పుణ్యస్థలంగా ఉంటున్నట్లు తెలుస్తున్నది. సబర్మతీతీరంలో ఖడ్గతీర్థం ఉన్నట్లు పద్మపురాణం చెపుతున్నది. ఇక్కడ ఖడ్గధరేశ్వ రాలయం వున్నది. సబర్మతిలో స్నానంచేసి ఖడ్గధరేశ్వర స్వామినిదర్శించినవారు సమస్తపాపాలనుండీ విముక్తులయి బహుకాలం స్వర్గధామంలోవుంటారని పురాణంచెపుతున్నది. యీ ప్రదేశంలోనే, నీలకంఠమహాదేవాలయంకూడావున్నట్లు పద్మపురాణం వర్ణించింది. కాలూపూర్ గేట్ అవతల దుఢే శ్వరఘట్టం వున్నది. ఇక్కడ దుఢేశ్వరమహాదేవాలయం నెలకొనివున్నది. దివ్యలోకంలో వుండే కామధేనువు తన క్షీరాన్ని యీ స్వామిపై వర్షింపచేసి, అభిషేకిస్తుందని చెపుతారు. ఈ ప్రదేశమంతటా క్షీరమయంగా ఉంటుందనీ ఒక్కొక్కప్పుడు చీకట్లో నదీజలాలపై పాలుపడుతూ ఉండడం కనిపిస్తుందనీ అంటారు. యీ ప్రాంతంలోనే

శ్మశానభూమికూడా ఉన్నది. పూర్వం ఇక్కడ దధీచిమహాముని ఆశ్రమం ఉండేదనికూడా చెపుతారు. ఇంద్రుడు వృత్రాసురుణ్ణి సంహరించడంకోసం దధీచిమహామునిసహాయం అర్థించాడు. అప్పుడా మహాత్ముడు తాను ప్రాణత్యాగంచేసి తన ఎముకలను ఇంద్రుడికి ఇవ్వగా—ఇంద్రుడు వాటితో వజ్రాయుధం తయారుచేయించి వృత్రాసురుణ్ణి వధించాడు. వేదాలు ఎంతటిపురాతనమైనవో దధీచిగాధ అంతపురాతనమైనది. ఖడ్గధారేశ్వరమహాదేవాలయానికి కొంచెంసమీపంలోనే సబర్మతీనదిఒడ్డున భీమనాధాలయం కూడా ఉన్నది. అసర్వాగ్రామంవద్ద ప్రాచీనమగు నీలకంఠ మహాదేవాలయం ఉన్నది. ఎలియస్‌వంతెనదగ్గర భద్ర అను దుర్గం ఉన్నది. ఆ దుర్గంలో నల్లటి నిలువెత్తు భద్రకాళీవిగ్రహం ఇప్పటికీ మనం చూడవచ్చును. ఇంకా నదీతీరాన పోగాపోగా—ఒకచోట దాదాపు 53 జైనదేవాలయాలు గుంపుగా కనుపిస్తాయి. వీటిలో ప్రధానమైనది ధర్మనాధ్‌జీఆలయం.అతను జైనతీర్థంకరులలో పదిహేనవవాడు! యీ ఆలయంమీది శిల్పం మహా అద్భుతంగా ఉంటుంది. రాయపూర్‌గేటువద్ద కాంకర్యతలావ్ ఉన్నది. దీనిని క్రీ.శ. 1458లో కుతుబుద్దీన్ నిర్మించాడు. ఈ తలావ్‌కుపశ్చిమాన —అహమ్మదాబాదును పాలించిన సుల్తాన్ మహమ్మద్ బెగడాకు మతగురువగు షా అలం స్తూపం ఉన్నది. దీనిమీదకూడా చెక్కడపుపని చాలా సుందరంగా కనుపిస్తుంది. ఇంకా జమీమసీదు,రాణులగోరీలు, రాణి—

శ్రీమసీదు, ఇంకా ఇతరభవనాలు అనేకం ఉన్నాయి. ఇవన్నీకూడా అద్భుతమగు శిల్పసౌందర్యంతోపుట్టిపడుతూ, హిందూ, అరబ్బీ - శిల్పశాస్త్రసమ్మేళనానికి చక్కని తార్కాణాలుగా వెలుగొందుతున్నాయి. జమాల్పూరుగేటువద్ద సప్తర్షులఘట్టం వున్నది. ఇక్కడ శివునిదేవాలయం, సప్తర్షుల ఆలయం వున్నాయి.

సబర్మతిఅవతలిఒడ్డున మహాత్మగాంధీజీ స్థాపించిన సబర్మతీఆశ్రమం వున్నది. ఆయన ఈ ఆశ్రమాన్ని 1917 లో స్థాపించాడు. అనేకసంవత్సరాలు తన రాజకీయ కార్యక్రమాలన్నింటికీ ఈ ఆశ్రమాన్ని కేంద్రంగా వుంచుకున్నాడు. 1930, మార్చిలో మహాత్ముడు చరిత్రప్రసిద్ధి కెక్కిన దండి సత్యాగ్రహాన్ని ఇక్కడనుంచే ప్రారంభించాడు. 'భారతదేశం స్వాతంత్ర్యంపొందేవరకూ మళ్ళీ ఈ ఆశ్రమంలో అడుగుపెట్టను'—అని అప్పు డాయన ప్రతిజ్ఞచేశాడు. అందువల్ల అప్పటినుంచీ సబర్మతీఆశ్రమం హరిజనోద్ధరణకు అంకితమైపోయింది. ఇప్పుడు ఇక్కడ అనేక నిర్మాణకార్యక్రమాలు కొనసాగుతున్నాయి. మహాత్మాజీ మొట్టమొదట స్థాపించిన ఆశ్రమం కొచెరిబ్ ఆశ్రమం. దాన్ని ఆయన క్రీ.శ. 1915లో స్థాపించాడు. రెండు సంవత్సరాలు అనగా 1917దాకా అక్కడ వున్నాడు. పిమ్మట — సబర్మతీఆశ్రమానికి తననివాసం మార్చుకున్నాడు. మహాత్మ గాంధీ అనేకసంవత్సరాలు నివసించి

ఎన్నెన్నో అద్భుతాలుచేసిన—సబర్మతీఆశ్రమం జగత్ప్రసిద్ధివహించింది.

సబర్మతీలోయలో చాలా ప్రాచీనమగు హిందూ నాగరికత విలసిల్లినట్లు - తెలియవస్తున్నది. కాంబేసమీపంలోని లోథాల్‌వద్దగల పురావస్తుశాస్త్రశాఖవారు ఈ ప్రాంతంలో హరప్పానాగరికతవిలసిల్లినదని వెల్లడించారు. సబర్మతీనది కోట్యార్క అనే ప్రదేశంగుండా పోతున్నది. ఈ ప్రదేశంలో చతుర్భుజాలుగల తెల్లని సూర్యదేవుని విగ్రహం ఉన్నది. ప్రణతిజ్ అను పట్టణానికి సుమారు పన్నెండుమైళ్ళదూరంలో ఉన్నది ఈవిగ్రహం. ముఖ్యంగా ఖద్యోతబ్రాహ్మణులకూ, వైష్ణవులకూ ఈప్రదేశం యాత్రాస్థలంగా దీనిని మధురార్క అనికూడా పిలుస్తారు. ఈ తీర్థస్థలంలో త్రికుమ్రాయ్‌జీ, ఘనశ్యామ్‌రాయ్‌జీల వైష్ణవాలయాలుకూడా కొన్ని వున్నాయి. వల్లభాచార్యుని సంప్రదాయంప్రకారం ఇక్కడ పూజా—వునస్కారాలు జరుగుతుంటాయి.

సబర్మతీతీరానగల అహమ్మదాబాద్‌లో పూర్వం ఒక గొప్పజ్ఞాని, మహాత్ముడు జన్మించాడు. అయనపేరు దాదూ. కొన్ని వందలసంవత్సరాలక్రితంవాడాయన. నాగర - బ్రాహ్మణకులంలో పుట్టాడు. పన్నెండవఏటనే జ్ఞానియై, సన్యాసంపుచ్చుకున్నాడు. రాజస్థాన్‌కు వెళ్ళిపోయి

అమీర్, సిక్రీ, నిరానా'— మొదలయిన ప్రదేశాలన్నీ తిరిగాడు. ఆయన తత్త్వోపదేశాలు విని అనేకులు ఆయ నకు శిష్యులయినారు. తుదకు సాంభర్‌వద్దనున్న బిరహా నాలో సిద్ధిపొందాడు. గొప్పవేదాంతి, కవి అగు—ఆఖా అనే ఆయనకూడా అహమ్మదాబాద్‌లో బహుకాలం నివ సించినట్లు తెలుస్తున్నది.

సబర్మతీ, మహీనదుల ముఖద్వారాలమధ్య ఖంబత్‌నగరం ఉన్నది. అనేకనదులు, దగ్గరదగ్గరగా ప్రవహించి, కాంబేసింధుశాఖలో కలుస్తున్నాయి. గుజ రాతురాష్ట్రానికి, పూర్వకాలంలో భిన్నమలా, వాలభి, పటాన్‌లవద్ద రాజధానులు నెలకొనివున్నాయి. చివరిరాజ ధాని సబర్మతీనదీతీరాన ఉన్నది.

సబర్మతి దక్షిణపుటొడ్డుననున్న ఫతేవాడీగ్రామం వద్ద ఈ నదికి 'నానిఫతేవాడి కెనాల్' అను ప్రాజెక్టు నిర్మించారు. ఈ ప్రాజెక్టు 1949 లో ప్రారంభించారు. దీనివలన దాదాపు 11 వేల ఎకరాలభూమి సాగుఅవు తున్నది. ఒక ప్రధానకాలువనూ, మూడు చిన్నకాలువ లనూ కలిపి 'మోతీఫతేవాడీ ప్రాజెక్టు' నిర్మించబడుతున్నది. దీనిమూలంగా 53 వేల ఎకరాలు సేద్యంక్రిందికి వస్తుం దని అంచనావేస్తున్నారు. ఈ పథకం ఇంకా పునర్విచా రణలో ఉన్నది.

సబర్మతినదీ ప్రాశస్త్యాన్ని గూర్చి పద్మపురాణం విపులంగా వర్ణించిచెప్పింది. ఈ నదీతీరానగల అహమ్మదాబాద్‌నగరం మహాత్మ గాంధీ నడిపిన రాజకీయ, జాతీయోద్యమాలకు బహుకాలం కేంద్రంగావుండి— మిక్కిలి ప్రఖ్యాతిచెందినది.





# నర్మద

భారతదేశంలో ముఖ్యనదులలోనూ, పొడవైన నదులలోనూ నర్మదానది ఒకటి. గంగ, గోదావరినదుల శ్రేణిలో చేరిసనది ఇది. మధ్యప్రదేశ్‌లో వింధ్యపర్వతాల లోని అమరకంటకం అనే కొండలో పుడుతున్న దీ నది. ఆ కొండ 22°-41' ఉ. అక్షాంశమీద, 81°-48' తూ. రేఖాంశమీద ఉన్నది. అక్కడనుంచి ఈ నది 801 మైళ్లు ప్రవహించి, చివరకు బ్రోచివద్దనున్న కాంబేసింధుశాఖలో కలుస్తున్నది.

నర్మదానదినిగురించి వేదవాఙ్మయం అంతగా చెప్ప లేదు కాని, మహాభారతంలోనూ, మత్స్య, పద్మ, కూర్మ, స్కాందపురాణాలలోనూ ఈ నదినిగురించి చెక్కుచోట్ల వర్ణించబడింది. నర్మద, రేవానదులు వేరువేరని కొందరి మతం. ఋక్షపర్వతంలో ఒకభాగంగా వుంటున్న మేఖల పర్వతంనుండి బయలుదేరుతున్నది నర్మదానది. మరి రేవా నదేమో వింధ్యపర్వతాలలోని అమరకంటనుండి వస్తు న్నది. అమరకోశకర్త - అమరసింహుడు నర్మద, రేవా నదులు రెండూ ఒకటిగానే చెప్పాడు.

'రేవా తు నర్మదా సోమోద్భవా
మేఖల కన్యకా'—

(అమరం)

నర్మదశబ్దానికి 'నర్మ కేళిం దదాతీతి నర్మదా -' అని వ్యుత్పత్తి. నర్మమనగా క్రీడ. క్రీడను ఇచ్చేదినర్మద. 'రేవతే రేవా; రేవృ ప్లవగతౌ'—దాటులతో పోయేది కనుక దీనికి రేవా అనిపేరు. సోమవంశంలో పుట్టిన పురూరవుడనే రాజువలన భూమికి తేబడిందికనుక సోమోద్భవ అనీ, మేఖలపర్వతంలో పుట్టడంవల్లన మేఖలకన్యక అనీ-నర్మదకు పేర్లువచ్చాయి. శతపథబ్రాహ్మణంలో రేవోత్తరులు అనే ఒకతెగనుగురించి చెప్పబడింది.

నర్మదా, రేవానదులు ఒకటిఅని చెప్పినా, రెండు అని చెప్పినా—ఒకటేమో అమరకంటకంలోనూ, మరొకటేమో మేఖలపర్వతంలోనూపుట్టి—కొంతలెక్క పోయిన తరవాత రెండూ కలుస్తున్నాయి. రేవా, నర్మదా అనే రెండుపేర్లతోనూ పిలువబడుతున్నాయి. నర్మదకు ఉత్పత్తిస్థానమగు అమరకంటకపర్వతం దాదాపు మూడువేల అడుగుల ఎత్తునఉన్నది. పదికోట్లతీర్థాలు అక్కడ వెలసిఉన్నాయని ప్రసిద్ధి. తరవాత నర్మదకు ఇరుదరులావున్న ముఖ్యతీర్థాలు నాలుగువందల పైచిలుకు అని చెపుతారు. నదులలోకెల్ల నర్మదానది శ్రేష్ఠమైనదని శాస్త్రిలు చెపుతున్నాయి. రుద్రునిదేహంనుండి ఉద్భవించింది ఈ నది. ఈ నది మానవులనేకాక సకలచరాచరకోటినీ పావనం చేస్తుందని శాస్త్రం. గంగానది కనఖలఅనేచోట నిక్కిలి పుణ్యప్రదమైనది. సరస్వతి కురుక్షేత్రంలో పుణ్యదాయక

మైనవి. మరి నర్మదానది - అడవిలోకానీ, గ్రామంలో కానీ—ప్రవహించినంతలెక్కా పుణ్యప్రదమేనని శాస్త్రం. సరస్వతినదీజలం పదిరోజులలో పాపాలన్నీ పోగొడుతుంది యమునాజలం ఏడురోజులలో పాపాలు పరిహరిస్తుంది. గంగాస్నానం తక్షణమే సకలపాపాలనూ నశింపచేస్తుంది. కాని, నర్మదానది కంటితో చూచినంతమాత్రాననే— సమస్తమయిన పాపాలనూ పోగొట్టి పుణ్యలోకాలు ప్రసాదిస్తున్నది-అని శాస్త్రవచనం. అమరకంటకానికే అమర కూటంఅనికూడా పేరు. అది కళింగదేశంలో భాగమని చెపుతారు. అక్కడ ప్రవహించే నర్మదానదీతీరంలో అనేక మంది మహర్షులు పూర్వం తపస్సుచేసినట్లూ, నదీతీర మంతటా విహరించినట్లూ తెలుస్తున్నది. జితేంద్రియుడైన వాడు నర్మదలో స్నానమాడి ఒక్కరాత్రి ఉపవాసంచేస్తే అతని పితృదేవతలు - నూరుతరాలవారు తరిస్తారనీ ధర్మ శాస్త్రం. నర్మదానది పొడవు నూరుయోజనాలనీ (యోజనం అనగా ఆమడ) వెడల్పు రెండుయోజనాలనీ చెపుతారు. ఈ నది పితృదేవతలకుమూర్తి అనీ, ఈ నదీతీరంలో శ్రాద్ధాలు పెట్టినా, పిండప్రదానాలుచేసినా—అంతులేని పుణ్యం లభిస్తున్నదని మన ధర్మశాస్త్రాలు చెపుతున్నాయి. సర్ప విషాన్ని పోగొట్టడంలో నర్మదాజలం చాలా శ్రేష్ఠమని అంటారు. నర్మద ఉత్పత్తిస్థానమగు అమరకంటకంలో - కావాలని అగ్ని ప్రవేశంవల్లకానీ, జలప్రవేశంవల్లకానీ,

ఉపవాసంవల్లకానీ దేహత్యాగంచేసినట్లయితే అలాంటివారు అప్పటికప్పుడే ముక్తిపొంది స్వర్గలోకాలకు పోతారని చెప్తారు. నర్మదాజలాలవల్ల అమరకంటకంలో ఏర్పడిన తటాకంచుట్టు ఎన్నో దేవాలయాలున్నాయి. అమరకంటకంనుంచి బయలువెడలే నర్మద, సోన్, మహానది—ఈ మూడు నదుల మూలస్థలాలు — ఆదికాలంనుంచీ గొప్ప తీర్థయాత్రాస్థలాలుగా ప్రసిద్ధికెక్కివున్నాయి. నర్మదానది జన్మస్థానానికీ అది సముద్రంలోకలిసే ప్రదేశమైన బ్రోచికే మధ్యలో 60కోట్ల 50 వేల తీర్థాలున్నట్లు అగ్ని, కూర్మ, స్కాందపురాణాలు చెపుతున్నాయి. అయితే, ఈ తీర్థాలన్నీ పాపాత్ములగు కలియుగంలోని మానవులకు ప్రత్యక్షంగా కనుపించవని స్కాందపురాణంలో ఉన్నది.

నర్మదనుగురించిన పురాణగాథ ఇది: పూర్వం ఒకప్పుడు శివుడు ఉమాసహితుడై ఋక్షపర్వతంమీద ఉగ్రతపస్సుచేశాడు. అప్పు డాయన దేహంనుండి చెమట పుట్టింది. అదే ఒక మహానదిగా ప్రవహించింది. ఆ నది ఒక స్త్రీరూపంధరించి—తనను అనుగ్రహించమని శివుణ్ణి ప్రార్థించింది. అప్పుడు శంకరుడు ఎప్పటికీ తరగని పుణ్యజీవనదియై ప్రసిద్ధిచెందమని నర్మదకు వరంఇచ్చాడు. ఆకారణంవల్లనే నర్మదకు రుద్రకన్య, అయోనిజ—అనే పేర్లువచ్చాయి. ఈ కథయే మరొకవిధంగాకూడా వర్ణించబడింది.

శివునిదేహంనుండి పుట్టిన స్వేదం ఒక చక్కని దేవకన్యరూపం ధరించింది. ఆ పిల్ల రూపురేఖావిలాసాలు చూచి, దేవతలూ రాక్షసులూకూడా మోహంలో మునిగి పోయారు. అందరూ ఆమెవెంటపడ్డారు. అప్పుడు శివుడు 'మీలో ఎవరుబలవంతులో వారికి ఆ కన్య దక్కుతుంది'- అని చెప్పాడు. దేవతలూ రాక్షసులూ పోటాపోటీలుపడి ఆ పిల్లను పట్టుకోడానికి ప్రయత్నంచేశారు. అయితే, ఆమె వారెవరికీ చిక్కలేదు. వాళ్ళను దగ్గరికిరానిచ్చినట్లే రానిచ్చి అంతలోనే అందకుండా మాయమైపోతూవచ్చింది. ఎన్నెన్నో చిత్రవిచిత్రరూపాలు ధరిస్తూవచ్చింది. ఆ విధంగా ఆటలాడుతూ - వాళ్ళందరినీ ముప్పతిప్పలుపెట్టి ఎంతోదూరం తిప్పింది. ఆమెక్రీడావినోదాలు చూచి శివుడు చాలా సంతోషంపొందాడు. ఆ కన్యకు నర్మద అని పేరు పెట్టాడు. నర్మం - అంటే క్రీడ. ఆ విధంగా ఆమెకు ఆ పేరు సార్థకమయింది. చివరకా కన్య శివుడివద్దకు వచ్చింది. ఇక దేవతలూ, రాక్షసులూ ఆశవదులుకుని ఊరుకున్నారు. అప్పుడు శివుడు ఆమెను సముద్రుడికి ఇచ్చి పెండ్లిచేశాడు. నర్మదానది పెద్దధ్వనిచేస్తూ, గంతులు వేస్తూ, దాటుకుంటూ పోయిన కారణాన రేవా అని పేరు పొందింది. పోతే అమరకంటకం—అనేదానికి ఈ విధంగా అర్థం చెపుతారు. అమరులంటే—దేవతలు. కట — అంటే శరీరం. దేవతలదేహాలమీద నర్మద నవ్వుకుంటూ నాట్యాలు

చేసింది. నర్మద పుట్టిన పర్వతంచుట్టూ దేవతలశరీరాలు మూగివున్నాయి. అందువల్లనే ఆ పర్వతానికి అమరకంటకం అని పేరువచ్చింది.

మరికొన్ని పురాణాలలో ఇలా ఉంది—నర్మద చంద్రుడికుమార్తె. ఆమెను పురుకుత్సుడు ప్రేమించాడు. ఆమెకూడా పురుకుత్సుని ప్రేమించింది. ఇలావుండగా గంధర్వులు నాగలోకానికి పోయి అక్కడ నాగులను బాధించడం మొదలుపెట్టారు. అప్పుడు నాగులు పోయి విష్ణుమూర్తితో మొరపెట్టుకున్నారు. 'పురుకుత్సుని ప్రార్థించండి—అతను మిమ్మల్ని రక్షిస్తాడు'—అని విష్ణువు చెప్పాడు. అంతట నాగులప్రార్థనపై పురుకుత్సుడు నాగలోకానికిపోయి - గంధర్వులను పారద్రోలాడు. నర్మద మూలంగా తమ కీ ఉపకారంజరిగినందున నాగులు సంతోషించి, 'నీ నామంస్మరించినవారికి సర్పబాధ వుండదు'—అని వరంఇచ్చారు. నర్మద పురుకుత్సుని పెండ్లాడింది. నర్మద పేరు తలచినవారికి సర్పబాధ ఉండదని శాస్త్రం.

కపిల. వైశాల్య, ఇరంది, ఇక్షునది, కవేరి—అనే నదులన్నీవచ్చి నర్మదలో కలుస్తాయి. అమరకంటకంనుండే బయలుదేరిన నర్మద—తరువాత కపిలాధర అనే ప్రదేశంలో—70, 80 అడుగులఎత్తునుండి క్రిందికి దిగుతుంది. అక్కడనుంచి వంకరటొంకరయిగావున్న మండలపర్వతాలగుండా ప్రవహిస్తుంది. జబల్‌పూర్‌వద్ద గుండ్రంగా ఒక ఇరుకైన మలుపుతిరిగి—30 అడుగులఎత్తునుండి దూకు

తుంది. ఈ జలపాతానికి 'ధువంధార'-అని పేరు. అక్కడ నుంచి చలువరాతికొండలమధ్యగుండా ప్రవహించి, పశ్చిమానికి మళ్ళుతుంది. వింధ్య, సాత్పూరా పర్వతపంక్తుల మధ్యనుంచి పోతుంది. దీనినే నర్మదాలోయ అంటారు. చక్కని చలువరాతికొండలమధ్యగల ఈ లోయ ఎంతో రమణీయమగుదృశ్యం. నదికి ఇరుదరులాగల కొండలు దట్టమైనఅడవులతో నిండివున్నాయి. నర్మద సారవంతమైన ఒండుమట్టిని తెచ్చి చేరుస్తున్నది. సముద్రంలో కలిసేముందు—నర్మదానది 170మైళ్ళదూరం బొంబాయి రాష్ట్రంగుండా ప్రవహిస్తున్నది. నదీముఖద్వారంలో వున్న బ్రోచ్‌వద్ద ఈ నది వెడల్పు 17మైళ్లు. బ్రోచ్ పూర్వం చాలా ప్రసిద్ధిగన్న రేవు. నర్మదకు ఉపనదులు చాలా వున్నాయి. వాటిలో మండలలోనుంచి వచ్చే బంజారు, నరసింగపూర్‌నుంచి వచ్చే షేర్, షక్కర్‌నదులు. హోషంగాబాదుజిల్లానుంచి వచ్చే తావా, చిన్నతావా, గంజాల్‌నదులు, జబల్‌పూర్‌జిల్లానుంచి వచ్చే హిరాన్, ముఖ్యమైన ఉపనదులు. నర్మదానదిమీద బహరాఘాట్, ఓంకారమాంధాత, బర్వానీ, కర్గాలీ, శుక్లతీర్థం, బ్రోచి—మొదలయినవి ప్రసిద్ధమగు స్నానఘట్టాలు.

మోర్‌టక్కా అనే ప్రదేశానికి సుమారు ఏడుమైళ్ళ దూరంలో నర్మదానది రెండుపాయలుగా చీలుతున్నది. ఒకటి నర్మద, రెండు కావేరి—యీ రెండుపాయలకూ మధ్య ఒక దీవి ఏర్పడింది. దీనిని మాంధాతద్వీపం అనీ,

శివపురంఅనీ పిలుస్తారు. ఇక్కడే ప్రసిద్ధమగు ఓంకార క్షేత్రం వుంది. ఓంకారేశ్వరుడు ఇక్కడ వెలశాడు. ఓంకారలింగం పన్నెండు జ్యోతిర్లింగాలలో ఒకటి - 'ఓంకార మమలేశ్వరం'—అని ఓంకారేశ్వరుడికే అమలేశ్వరుడు లేక అమరేశ్వరుడు అని పేరుకూడా వున్నది. ఓంకారేశ్వరాలయం చాలా ప్రాచీనమైనది.

పూర్వం కృతయుగంలో ఇక్ష్వాకువంశజుడగు మాంధాతచక్రవర్తి ఈ ప్రదేశంలో శంకరుణ్ణిగురించి తపస్సుచేశాడు. శంకరుడి అనుగ్రహం పొందాడు. అందుకే యీ ప్రదేశానికి మాంధాతద్వీపం, లేక శివపురం అని పేరువచ్చింది. పూర్వం శిథిలమైపోయిన ఓంకారేశ్వరాలయాన్ని మహారాష్ట్రపీష్వాలు పునరుద్ధరించారు. ఇప్పుడున్న ఆలయం పీష్వాలకాలంలో కట్టిందే—ఓంకారేశ్వరుడికి అమలేశ్వరుడని పేరువున్నప్పటికీ—యీ రెండు పేర్లతో రెండు ఆలయాలు వేరువేరుగా వున్నాయి. పూర్వం వింధ్యాద్రి శివుణ్ణిగురించి ప్రార్థించిందనీ - దేవతల, మునుల కోరికపై ఇక్కడ జ్యోతిర్లింగం రెండు ముక్కలై రెండుగా వెలసిందనీ, ఒకటి ఓంకారేశ్వరుడూ, రెండవది అమరేశ్వరుడు లేక అమలేశ్వరుడు అనుపేర్లతో ప్రసిద్ధి చెందాయనీ పురాణాలు చెపుతున్నాయి. ఓంకారనాధంలో కార్తీకపూర్ణిమనాడు గొప్పవుత్సవం జరుగుతుంది. ఇక్కడ ఒక కొండకూడా ఉన్నది. దీన్ని భృగుపతనం అని పిలు

స్తారు. పూర్వం పుణ్యాత్ములెందరో ఆ ప్రదేశంలో దేహ త్యాగంచేసి ముక్తిపొందినట్లు చెపుతారు

నర్మదానది శంకరుడి బాణలింగాలకు ప్రసిద్ధి. బాణాకారంలోవుండే లింగాలు బాణలింగాలంటారు. శివ పూజాపరులు ఇవి చాలా మహత్తు కలవిగా భావించి పూజి స్తారు. నర్మదానదిలో ఎక్కడచూచినా బాణలింగాలే. నదిలో ఎన్నిరాళ్లున్నాయో అన్ని బాణలింగాలున్నయని అంటారు. ఓంకారనాథంనుండి పోతే కొద్దిమైళ్ళలోపు ననే యీ నదిలో త్రినేత్రాలు, యజ్ఞోపవీతం - గుర్తులుగా గల బాణలింగాలు అనేకం దొరుకుతాయి. ఈ లింగాలను నర్మదేశ్వరలింగాలని అంటారు. చాందోడ్, కర్నాలీ—అనే ప్రదేశాలు ప్రసిద్ధ తీర్థయాత్రాస్థలాలు. చాందోడ్‌వద్ద ఓర్ సంగమం ఉన్నది. ఓర్‌నది వచ్చి ఇక్కడ నర్మదలో కలుస్తున్నది. పూర్వం వ్యాసమునీంద్రులవారిపుత్రుడగు శ్రీశుకుడు బాల్యంలోనే సర్వసంగపరిత్యాగంచేసి విరా గియై వెళ్ళిపోయాడు. అప్పుడు వ్యాసుడు, కుమారుణ్ణి తిరిగి తీసుకరావడానికి వెనకాల పరుగెత్తాడు. శుకయోగి అవతలిఒడ్డున వుండగా—వ్యాసుడు చాందోడ్‌వద్ద తపస్సు చేసినట్లు చెపుతారు. చాందోడ్‌కు ఎనిమిదిమైళ్ళదూరాన, నర్మదానదిలోని ఒకదీవిలో ఇప్పటికీ వ్యాసులవారిగుడి వున్నది. ఆ సమీపంలోనే బెర్‌కాల్ అనే చిన్నపట్టణం వున్నది. అది సామవేద బ్రాహ్మణులకు ప్రసిద్ధిచెందిన చోటు.

వ్యాసాలయానికి దక్షిణంగా శుకదేవమహాదేవ ఆలయమున్నూ, వ్యాసుడిగుడికి నాలుగుమైళ్ళదూరంలో అనసూయ ఆలయమున్నూ వెలసివున్నాయి. అవతల ప్రక్కన కర్నాలీ అనే పట్టణంలో మహాపండితులగు వైదికనాగర బ్రాహ్మణులు, సన్యాసులు అనేకులున్నట్లు ప్రసిద్ధిగా చెప్పుకుంటారు. ఇంకా అవతలికి పోతే కుంభేశ్వరమహాదేవ ఆలయం, శనైశ్వరాలయం ఉన్నాయి. శనిగ్రహపీడ పట్టినవారు ఇక్కడికి వచ్చి శనైశ్వరుని పూజించి బాధానివారణ చేసుకుని పోతుంటారు. ఇంకా తూర్పుగా పోతే, నర్మదానదిఉత్తరపుగొడ్డున ఒక అరణ్యమధ్యంలో సూర్పణేశ్వరాలయంఉన్నది. ఇక్కడ భిల్లులు నివసిస్తున్నారు. అప్పుడప్పుడు యీప్రదేశంలో మాకు అశ్వత్థామ అగుపిస్తుంటాడని వీరు చెపుతుంటారు. అశ్వత్థామ మహాభారతయుద్ధంలో ప్రసిద్ధిచెందిన వీరుడు. ద్రోణాచార్యునిపుత్రుడు. అస్త్రవిద్యలో మొనగాడు. అంతేకాదు. ఆయన చిరంజీవి అని మన పురాణాలు చెపుతున్నాయి. భారతయుద్ధంలో చివరిఘట్టంలో ఒకనాటిరాత్రి అశ్వత్థామ పాండవులశిబిరంలో ప్రవేశిస్తాడు. అక్కడ నిద్రపోతున్న ద్రౌపది పుత్రులు ఉపపాండవులను నిర్దాక్షిణ్యంగా చంపి కసితీర్చుకుంటాడు. అప్పుడు పాండవులు ద్రౌపది పుత్రదుఃఖాన్ని పోగొట్టేటందుకు అశ్వత్థామను పట్టుకుంటారు. అశ్వత్థామ తలలో ఒక మణి వున్నది. అది అతనికి ప్రాణసమానమైనది. గొప్ప మహిమకలది. పాండవులు అతని శిరో

రత్నాన్ని ఊడబెరికి తీసుకుని - అతన్ని ప్రాణాలతో విడిచిపెడతారు. అంతట చిరంజీవి అగు అశ్వత్థామ విరాగియై తపస్సుచేసుకోడానికి కృష్ణద్వైపాయనుడి ఆశ్రమానికి వెళ్ళిపోతాడు. ఇక్కడికి పశ్చిమాన శుక్లతీర్థం ఉన్నది. అది గొప్ప యాత్రాస్థలం. అక్కడ కవి, ఓంకారేశ్వర, శుక్ల—అనే మూడు ముఖ్యకుండా లున్నాయి. కార్తీక పూర్ణిమనాడు ఉత్సవం జరుగుతుంది. శుక్లతీర్థానికి ఒకమైలు దూరంలో ఒక చిన్నదీవిలో కబీరువాడ అనే ప్రసిద్ధమైన స్థలం ఉన్నది. భక్తకబీరు తాను దంతకాష్ఠంగా ఉపయోగించే ఒకపుల్లను ఇక్కడ భూమిలో పాతాడట. దానిచుట్టూ ఇప్పుడున్న కబీరువాడ వెలసినట్లు చెపుతారు. శుక్లతీర్థానికి పదిమైళ్ళదూరంలోనే బ్రోచి వున్నది. బ్రోచి యాత్రాస్థలం. ఇక్కడ భృగుమహర్షి ఆశ్రమం ఉన్నది. ముఖ్యంగా దశాశ్వమేధఘట్టం అనేచోటు పుణ్యతీర్థంగా భావించబడుతున్నది. బ్రోచికి సమీపంలోనే జామదగ్న్య అనే తీర్థం కూడా ఉన్నది.

ఇప్పుడున్న బ్రోచిపట్టణంవద్దనే పూర్వం బలిచక్రవర్తి అశ్వమేధయాగంచేసినట్లు చెపుతారు. బారుకచ్ఛ, భృగుపుర, భృగుక్షేత్ర, భృగుకచ్ఛ—అనే పేర్లతో బ్రోచి మన పురాణాలలో వర్ణింపబడింది. మహాభారతకాలంలోనే ఈ పట్టణం ఉన్నట్లు తెలుస్తున్నది. భీమసేనుడికుమారుడు-ఘటోత్కచుడు ఇక్కడ కొంతకాలం ఉన్నట్లు చెపుతారు. ఇది గొప్ప తీర్థయాత్రాస్థలమేకాక, ముఖ్యమైన రేవుపట్టణ

మనికూడా కూర్మ పురాణంలో చెప్పబడింది. భృగుమహర్షి ఇక్కడ తపస్సుచేసినట్లు ప్రసిద్ధి.

బ్రోచిప్రాంతంలోనే పూర్వం హైహయవంశజుడయిన కార్తవీర్యార్జునుడి రాజధానియగు మహిష్మతీపురం ఉన్నట్లు చెపుతారు. ఏమైనా కార్తవీర్యార్జునుడు వింధ్య పర్వతప్రాంతంలో నర్మదానదీతీరాన ఉన్నట్లు పురాణాల వల్ల తెలుస్తున్నది. కార్తవీర్యుడికి వెయ్యిచేతులు. గొప్ప బలశాలి. దత్తాత్రేయునివలన వరంపొందినవాడు. ఒకప్పుడతను అంతఃపురస్త్రీలతో నర్మదానదికి వెళ్ళాడు. తన వేయిబాహువులతో నర్మదానదీప్రవాహాన్ని అరికట్టి అక్కడ స్త్రీజనంతోకూడి జలక్రీడలాడాడు. ఆసమయంలో రావణుడు ఆ ప్రాంతానికి వచ్చి—ఒకచోట శివపూజచేసుకుంటున్నాడు. కార్తవీర్యుడు నర్మదాజలాలను అరికట్టినందున—ఆ నీరు వచ్చి రావణుడి శివపూజకు భంగం కావించింది. అప్పుడు రావణుడు కోపంతోవచ్చి—కార్తవీర్యుడితో యుద్ధంచేసి—అతన్ని ఓడించాడు. పిమ్మట కొండొకకారణాన జమదగ్ని సుతుడగు పరశురాముడు—కార్తవీర్యార్జునుణ్ణి సంహరించి మహిష్మతీపురాన్ని ధ్వంసం చేశాడు.

నర్మదానదికి 35 సంగమస్థలా లున్నాయి. అన్నిట్లోకీ శ్రేష్ఠమైనది రేవాసాగరసంగమం. నర్మదానదికి తరచు వరదలు వస్తుంటాయి. ఈ నదిపై పెద్దప్రాజెక్టులేవీ

నిర్మింపబడలేదు. నర్మదలోయ, యూకై ప్రాజెక్టులు పంచ వర్ష ప్రణాళికలలో చేర్చబడినాయి.

జబల్‌పూర్ వద్ద చలువరాతికొండలమధ్య గల నర్మదలోయ వెన్నెలరాత్రులందు చూస్తే, చాలా మనో హరంగా ఉంటుంది. ఈ నదీముఖద్వారాన్నుండి లోపలికి 60 మైళ్ళదాకా పడవలమీద ప్రయాణంచేయవచ్చును. మన దేశంలో చాలానదులు పశ్చిమాన-పుట్టి, తూర్పుదిశగా ప్రవ హించాయి. కాని నర్మద పశ్చిమదిశగా ప్రవహించి, పడమటిసముద్రంలో కలుస్తున్నది. ఈ నదికిగల విశేషాలలో ఇది ఒకటి. అందువల్లనూ ఈ నది గొప్పపుణ్యనదిగా చెప్పబడుతున్నది.



# తపతి

తపతీనది సాత్పూరాపర్వతశ్రేణిలో తూర్పునవున్న మహాదేవికొండలలో పుట్టింది. ఈ ప్రదేశాన్నే వింధ్య పాదమూ, గోణణగిరి అను పేర్లతో పిలుస్తారు. అక్కడ పుట్టిన తపతీనది పశ్చిమదిశగా ప్రవహించి, చివరకు సూరత్‌వద్ద అరేబియాసముద్రంలో పడుతున్నది. ఈ నది పొడవు సుమారు 450 మైళ్లు. పరీవాహప్రదేశం సుమారు 30 వేలమైళ్లు. మొదట 150మైళ్ళదూరం సాత్పూరాపీఠ భూమిలోనే ప్రవహిస్తుంది. తరువాత ఖాందేష్‌గుండా—ఇంకా పశ్చిమానికి గుజరాతులో ప్రవహించి, సూరత్‌జిల్లా లోనుంచి పోతుంది.

తపతీనది జన్మస్థానం గొప్ప పుణ్యతీర్థంగా భావించ బడుతున్నది. దానిని మూలతపి లేక మూలతాయి—అని అంటారు. తపతికి తపి అనుపేరుకూడా వున్నది. సరిగ్గా గుర్తించి చెప్పాలంటే, ఈ నది వుత్పత్తిస్థానం 21°.48' ఉ. అక్షాంశ, 78°.15' తూ. రేఖాంశలమీద వున్నది. బెతూల్‌జిల్లాలోనుంచి ప్రవహించిన పిదప, సాత్పూరా కొండకోనలనుండి బయటపడి, నేమార్ జిల్లాలో ప్రవేశి స్తుంది. బురహాన్‌పూర్‌పట్టణానికి అవతల కొద్దిమైళ్ళ దూరంలో ప్రవహిస్తుంది. అప్పుడు బీరారుకొండలనుండి పూర్ణానది వచ్చి తపతీనదితో కలుస్తుంది. పూర్ణా, పయోష్ణి

నదులు ఒకటేనని కొందరు పండితులంటారు. కాని పురాణాలు యీ రెండునదులనూ వేరువేరుగా పేర్కొన్నాయి. స్కాందపురాణంలో తపతీనదినిగురించి విపులంగా చెప్పబడింది. తపతీమహాత్మ్యం అనుపేరుతో కొంతభాగం వున్నది. తీర్థప్రకాశ అనుగ్రంథంలోకూడా యీ నది వర్ణించబడింది. మహాభారతం ఆదిపర్వంలో యీ నదికథ ఇలా ఉన్నది: తపతి సూర్యభగవానుడికుమార్తె. ఒకనాడు సంవరుణుడనేరాజు అరణ్యంలో యీమెనుచూచి మోహించాడు. గాంధర్వవిధిని తనను పెండ్లాడమని కోరాడు. కాని, తండ్రిఅనుమతి లేకుండా తాను ఒప్పుకోలేనని చెప్పి తపతి అదృశ్యమైంది. అంతట సంవరుణుడు సూర్యుణ్ణిగూర్చి గొప్ప తపస్సుచేశాడు. ఆయన్ను మెప్పించి - తపతిని భార్యగా పొందాడు. తపతికి సంవరుణునివలన ఒకకుమారుడు కలిగాడు. అతనిపేరు కురు. అతనే కురువంశానికి మూలపురుషుడయినాడు. ఈ కథనే భాగవతం కొంచెం విపులంగా చెప్పింది. విశ్వకర్మకుమార్తెయగు సంజ్ఞాదేవి సూర్యునిభార్య. సంజ్ఞయందు సూర్యుడుకి వైవస్వతుడు పుట్టి మనువైనాడు. సంభోగసమయంలో సూర్యునితేజస్సు చూడలేక సంజ్ఞాదేవి కన్నులుమూసుకున్నది. అందుకు సూర్యుడికి భార్యమీద కోపంవచ్చింది—'నీకు అఖిలజనైక సంయమనుడగు కుమారుడు పుడతాడు' అని సంజ్ఞతో పలికాడు. ఆ ప్రకారంగానే సంజ్ఞకు యముడు జన్మిం

జన్మించాడు. తరవాత ఆమె చంచలదృష్టితో భర్తను చూచింది. 'నీకు విలోలయగు కూతురు పుడుతుంది' అన్నాడు మళ్ళీ సూర్యుడు. ఆవిధంగా సంజ్ఞకు యమునా నది జన్మించింది. సంజ్ఞాదేవి సూర్యుడికి భయపడి ఇహ అక్కడ నిలవలేక—తన ఛాయ (నీడ)ను సూర్యునివద్ద ఉంచి తాను బడబరూపం ధరించి కురుదేశాలకు వెళ్ళిపోయి అక్కడుంది. సూర్యుడికి యీవిషయం తెలియదు. తనవద్దనున్న ఛాయతో రమించాడు. ఆమెవలన శని, సావర్ణుడు—అను ఇరువురు కుమార్లూ, తపతి అను కుమార్తె జన్మించారు..

స్నానం, పానం, దర్శనం ఈ మూడు లేకుండానే, కేవలం స్మరించినంతమాత్రాననే తపతి సమస్తపాపాలనూ పోగొట్టి ఉత్తమగతులు కలిగిస్తుందని—తపతీమహాత్మ్యం పేర్కొన్నది.

బురహాన్పూరుపట్టణం తపతీనది దక్షిణపుటొడ్డున ఉన్నది. ఇది పురాతనమైనపట్టణం. క్రీ.శ.1400 సంవత్సరాలనాటిది. షేక్ బురహానుద్దీను అనుపేర ప్రసిద్ధికెక్కిన నసీర్ ఖాన్ ఫరూకీ ఈ నగరాన్ని నిర్మించాడు. మొగలుల దక్కనురాజ్యాలకు ఇది చాలాకాలం ముఖ్యనగరంగా వున్నది. తపతీనదికి సుమారు ఒకమైలుదూరంలో భుసావల్పట్టణం వున్నది. ఈ పట్టణంచేరువనే తపతీ, పూర్ణా నదులు కలుస్తున్నాయి.

ఈ రెండునదులసంగమప్రదేశం గొప్ప పుణ్యతీర్థంగా ప్రసిద్ధికెక్కింది. ధూలియాకు వాయవ్యదిశన సుమారు పాతికమైళ్ళదూరాన, ఈ నదులసంగమప్రదేశంలో ప్రకాశ మనే మరొకపుణ్యతీర్థం వున్నది. ఇక్కడికి తూరుపు దిక్కున గౌతమేశ్వరమహాదేవుని ఆలయం వున్నది. పన్నెండేండ్లకొకమాటు—బృహస్పతి సింహరాశిలో సంచారంచేస్తున్నప్పుడు ఇక్కడ గొప్ప కుంభమేళాఉత్సవం జరుగుతుంది. తపతీ, పూర్ణానదులమధ్య—సంగమేశ్వర మహాదేవుని ఆలయంకూడాకలదు. ఈ నదిమీద సుమారు నూటఎనిమిది తీర్థాలు వున్నట్లు తపతీమాహాత్మ్యం పేర్కొన్నది. ధారోలీ అను గ్రామంవద్ద ధారేశ్వరతీర్థం, మోటా గ్రామంవద్ద ముక్తేశ్వరతీర్థం, బహుధాన్ పట్టణందగ్గర గౌతమేశ్వరతీర్థం, కామలేజ్ లేక కామ్రేజ్ అను గ్రామంవద్ద కోటేశ్వరతీర్థం, ఖోల్వాన్ గ్రామం దగ్గర క్షిప్రావతతీర్థం, అబ్రమాపట్టణంవద్ద అంబరీషేశ్వరతీర్థం, సూరత్‌సమీపానగల అశ్వినీకుమార్ దగ్గర అశ్వతీర్థం, కటర్‌గాంవద్ద కంటరేశ్వరతీర్థం, ఫూక్ పావగ్రామందగ్గర గుప్తేశ్వరతీర్థం, వారియవ అను ఊరి వద్ద వారితప్యతీర్థం, సూరత్‌సమీపాన రామ్‌నాధ్‌ఘేలా అను చోట రామేశ్వరతీర్థం, నారసనగ్రామంవద్ద దర్భేశ్వరతీర్థం, హజీరాసమీపాన మోరాగ్రామంవద్దనున్న జరత్కారేశ్వర తీర్థం—ముఖ్యమైనవి.

తపతీనది ఆషాఢ శుద్ధ సప్తమినాడు జన్మించినట్లు చెపుతారు. బ్రహ్మకు శాంతిప్రసాదించడంకోసం సరిగ్గా మిట్టమధ్యాహ్నంవేళ జన్మించిందట. కనుక ఆషాఢ శుద్ధ సప్తమీతిథి ఆదివారంనాడు వస్తే మరీ పర్వదినంగా చెపుతారు. ఏమైనా ఆషాఢమాసంలో తపతీనదిలో స్నానం చేయడం, ఆ నదీతీరంలో దానధర్మాలు, జపాలు, పూజలు తపస్సు, యజ్ఞాలు—చేయడం చాలా పుణ్యప్రదం. పశ్చిమ ఖాండేష్‌జిల్లాలోని సిరిపూర్‌తాలూకాలో తపతీనదీతీరానగల తాల్గారు అనే ప్రదేశం చాలా ప్రసిద్ధమైనది. అక్కడ పురాతనమైనకోట వున్నది. చారిత్రాత్మకమైనస్థలం అది. క్రీ.శ.1128ప్రాంతంలో ఆ దుర్గం నిర్మింపబడినట్లు తెలుస్తున్నది. సూరత్‌జిల్లాలో మాండ్వేతాలూకాలోగల బహుధాన్‌కూడా గొప్ప యాత్రాస్థలం. పన్నెండేండ్లకొకసారి అక్కడ గొప్ప ఉత్సవం జరుగుతుంది. యాత్రీకులు అనేకమంది వచ్చి గౌతమేశ్వరమహాదేవుని దర్శిస్తారు. సూరత్‌కు సుమారు రెండుమైళ్ళదూరాన, తపతీనది దక్షిణ తీరాన రాందేర్ అను పురాతనపట్టణం వెలసివున్నది. దక్షిణగుజరాత్‌లోని నగరాలలోకెల్లా ఇది పురాతననగరమని చెపుతారు. పూర్వపు 'లాట'దేశానికి ఇది ముఖ్యపట్టణంగావుండేదని కొందరు చరిత్రకారులు పేర్కొన్నారు. క్రీ. పూ. 200 లో సంపత్తి అను రాజు ఇక్కడ నాలుగు దేవాలయాలు నిర్మించాడని చెపుతారు. అత్యంతప్రాచీనమైన, చారిత్రాత్మకమైన సూరతుపట్టణం తపతీనదిదక్షిణ

తీరాన వున్నది. సూరత్ సముద్రపురేవు — సూరత్‌నుండి సుమారు పన్నెండుమైళ్ళదూరంలో సువాలీఅనుప్రదేశంలో వున్నది. ప్రాచీనమగు సూర్యపురమే—సూరత్‌గా మారిందని అంటారు. ఏమైనా ఇది చాలా పురాతనరేవుపట్టణం. ముఖ్యంగా మొగలుచక్రవర్తులకాలంలోనూ, యూరోపియన్ దండయాత్రల తొలికాలంలోనూ ఇది ప్రధానమైన రేవుపట్టణంగా ఉన్నట్లు తెలుస్తున్నది.

దిగువతపతీనది లోయప్రాంతాలలో నీటిపారుదల ఏర్పాట్లు చేయబడినాయి. 1949లో బొంబాయిప్రభుత్వం ఈ నదిమీద కంక్రపారాప్రాజెక్టును ప్రారంభించింది. దాదాపు 850మైళ్ళదూరం కాలువలుతీశారు. సూరతుజిల్లాలో సుమారు 800 వేల ఎకరాలభూమికి నీటివసతిలభించేటట్లు చేశారు. ఈ ఏర్పాటుకు పూర్వం తపతీనదీజలాలు ఏమాత్రం ఉపయోగించుకోడం జరుగలేదు. నదీజలాలన్నీ వ్యర్థంగా పోతూవచ్చాయి. ముఖ్యంగా సూరతుపట్టణంవద్ద 2039 అడుగుల పొడవున, 50 అడుగులఎత్తున పెద్ద ఆనకట్ట కట్టారు. పూర్వంనుండీ వస్తున్న తపతీనదివరదలను అరికట్టారు. దీనిమూలంగా ఇక్కడిపొలాలలో ఏడాదికి రెండుపంటలు పండించడానికి వీలయింది. చాలాభూమి సాగులోనికి వచ్చింది. కంక్రపారాప్రాజెక్టుక్రింద 5 లక్షల 62 వేల ఎకరాలభూమికి నీరు అంది, సాగులోనికివస్తున్నది. సోంగడ్‌తాలూకాలో యూకై అనుచోట తపతీనది

మీద రిజర్వాయరు కట్టడానికి ద్వితీయపంచవర్షప్రణాళికలో ఏర్పాట్లుజరిగాయి. ఈ రిజర్వాయరుమూలంగా పైన చెప్పి నంతభూమికి నీటివసతి లభించడమేకాక, సూరత్, బ్రోచి జిల్లాలలో ఇంకా కొత్తప్రాంతాలకు నీరు లభ్యమయ్యేటట్లు చూడడం జరుగుతున్నది. అంతేకాదు, యూకై ప్రాజెక్టువల్ల జలవిద్యుచ్ఛక్తి కేంద్రంకూడా ఏర్పాటుచేయడం సంభవిస్తున్నది. తపతీనదీజలాలను అనేకవిధాలుగా ఉపయోగించుకోడానికి ఇంకా రకరకాల ఏర్పాట్లకు ఆలోచనలుచేస్తున్నారు. కంక్రపారాప్రాజెక్టుకుపూర్వం సూరత్‌పట్టణానికి వరదలతాకిడి మిక్కుటంగా ఉండేది. 1837లో బ్రహ్మాండమైన వరదలువచ్చి పట్టణాన్ని చాలాభాగం ముంచివేశాయి. ఇప్పుడు పంచవర్షప్రణాళికలలో జరుగుతున్న ఏర్పాట్ల వల్ల ఈ ప్రమాదాలు క్రమంగా తగ్గిపోతున్నాయి.

హజీరావద్ద తపతీసాగరసంగమం గొప్ప పుణ్యస్థలం. మార్గశిర అమావాస్యనాడు ఈ నదీసాగరసంగమంలో స్నానంచేసి—అక్కడున్న నాగేశ్వరుణ్ణీ, జరత్కారేశ్వరుణ్ణీ దర్శించినవారు మోక్షంపొందుతారని మన ధర్మశాస్త్రాలు చెపుతున్నాయి.

ఇక్కడ జరత్కారేశ్వరునిగూర్చి ఒకపురాణగాథ ఉన్నది. పూర్వం ఒకముని—కఠోరమగు బ్రహ్మచర్య వ్రతం అవలంబించి, నిరంతరం తపోనిమగ్నుడై ఉంటూ వచ్చాడు. తపస్సువల్ల ఆయనదేహంపూర్తిగా శుష్కించి

పోయింది. అందువల్ల ఆయనకు జరత్కారుడని పేరు వచ్చింది. ఇలావుండగా ఒకమాటు ఆయనపితరులు కనుపించి ఆయనతో—'నాయనా! నీవు వివాహంచేసుకోనందువల్ల మా వంశం నిర్వంశం అయిపోయింది. అందువల్ల మాకు ఉత్తమలోకాలు లభించలేదు. కనక నీవు పెండ్లి చేసుకుని, కుమారునికని మమ్మల్ని ఉద్ధరించు'—అని చెప్పారు.

పితృదేవతల కోరికను మన్నించి జరత్కారముని వివాహంచేసుకోడానికి నిశ్చయించుకున్నాడు. కాని, ఒక నియమంపెట్టుకున్నాడు. తనపేరుగల కన్యదొరికితేనే వివాహంచేసుకుంటానని ప్రతినపట్టాడు. అయితే ఎక్కడ తిరిగినా ఆపేరుగల పిల్ల లభ్యంకాలేదు. చివరకు సర్పరాజగు వాసుకి చెల్లెలుపేరు జరత్కారువు—అని తెలిసింది. వాసుకి సంతోషంగా తనచెల్లెలిని తెచ్చి జరత్కారునికిచ్చి పెండ్లిచేశాడు. ఆ వివాహం తపతీసాగరసంగమంవద్దనే జరిగింది. అందువల్ల ఆ స్థలం గొప్ప పుణ్యస్థలంగా ప్రసిద్ధికెక్కింది. అక్కడ జరత్కారేశ్వరుడు వెలశాడు. తరవాత జరత్కారుడు, తనభార్యవలన ఒక పుత్రుని కని, తన పితరులకు ముక్తికలిగించాడు. జరత్కారుని పుత్రునిపేరు ఆస్తీకుడు. జనమేజయునివద్దకుపోయి, సర్పయాగం మాన్పించి నాగజాతిని రక్షించినవాడు ఆస్తీకుడే. ఆస్తీకునిపేరు స్మరిస్తే సర్పభయం ఉండదని శాస్త్రం.

తపతీనదీతీరంలోవున్న ఆలయాలన్నీ శివాలయాలే. ఈ నదికి ఇరవై ఒక్క పేర్లువున్నట్లు తపతీమహాత్మ్యం చెపుతున్నది. తపి, తపినీ, సావిత్రి, నాసత్య, అమృతస్యందినీ, సర్పవిషాపహా, తారా—మొదలయినవన్నీ తపతీనదిపేర్లు. అంతేకాదు, ఈ నది పర్వతరాజతనయ అయినట్లూ, వనదేవతఅయినట్లూ వర్ణించబడింది. గోశ, కాశ్యపి, సేన, విరాహా—మొదలగునవి తపతికి ఉపనదులుగా చెప్పారు. ఆషాఢశుద్ధ సప్తమినాడు తపతీతీరంలో ఆహారపదార్థసహితంగా పూర్ణకుంభజలదానంచేస్తే అమితపుణ్యం వస్తుందంటారు.

మరొకకథకూడా తపతీమహాత్మ్యంలో ఉన్నది. పూర్వం శ్రీరాముడు సూరత్‌వద్దకు సముద్రస్నానానికి వచ్చాడు. అప్పుడు సముద్రుడు—ఒకబ్రాహ్మణవేషంతో రామునిచెంతకువచ్చి దానం అడిగాడు. ఏంకావాలో కోరుకోమన్నాడు రాముడు. అప్పుడు బ్రాహ్మణరూపంలోవున్న సముద్రుడు తపతీసాగరసంగమంలో రామునిస్నానంచెయ్యవద్దని కోరాడు. ఆడినమాట తప్పదుకనక—రాముడు సరేనని సాగరసంగమంలో స్నానమాడకుండా, వెళ్ళాడు. శ్రీరాముడు కనుక అక్కడస్నానంచేసినట్టయితే ఆయనకు ఏ ఆపదా రాదు. సీతావియోగం జరిగేదేకాదు. అందువల్ల రావణసంహారమూ జరగదు. దేవకార్యమూ నెరవేరదు. కాబట్టే సముద్రుడు శ్రీరాముని ఆ వరంకోరాడు. దీనినిబట్టి

తపతీసాగరసంగమం ఎంతటి మహత్తుకలదో, ఎంతటి పుణ్యస్థలమో తెలుస్తున్నది. సూరత్‌సమీపంలో రామనాథ్ గాలావద్ద శ్రీరాముడు ప్రతిష్ఠించిన రామేశ్వరలింగం ఇప్పటికీ వున్నది.

నర్మదలాగానే తపతికూడా పశ్చిమదిశగా ప్రవహించి పశ్చిమ సముద్రంలో పడుతున్నది. శ్రేష్ఠమగు పుణ్యనదులలో తపతి ఒకటి.



# మ హీ

పశ్చిమఇండియాలోని పెద్దనదులలో మహీనది ఒకటి. గుజరాతుకు సంబంధించినంతవరకూ నర్మద, తపతీ నదుల తరువాత ఇది ముఖ్యనదిగా భావించబడుతున్నది. మహీనదిని మాహీనదిఅనికూడా పిలుస్తారు.' దీనిపొడవు సుమారు 350 మైళ్ళు. పరీవాహప్రదేశం పదిహేడువేల మైళ్ళు. దీని ఉత్పత్తిస్థానం మధ్యభారత్‌లోని అమ్‌ఝీరా జిల్లాలో 22౦.53'ఉ. అక్షాంశ 75౦.5' తూ. రేఖాంశల మీద సముద్రమట్టానికి 1850 అడుగులఎత్తున వున్నది. వింధ్యపర్వతాలలో పశ్చిమదిశన అమ్‌ఝీరానగరసమీపంలో మెహద్‌సరస్సునందు జన్మిస్తున్నది. చివరకు గుజరాతులోని కాంబేసింధుశాఖలో పడుతున్నది. ఈ నది ఉత్పత్తి స్థానం సముద్రానికి సరిగ్గా తూర్పున 160మైళ్ళదూరంలో వున్నప్పటికీ—ఇది ఆమార్గాన ప్రవహించక ఉత్తరదిశగా పోయి, కొంతలెక్కు వెళ్ళినతరువాత మలుపుతిరిగి గుజరాతులో ప్రవేశిస్తున్నది. జన్మస్థానంనుండి ఆరావళీపర్వత పంక్తులవైపుపోయి పూర్వపురాష్ట్రాలగు గ్వాలియర్, ధార్, ఝాబూ, రత్లామ్, శైలానాలగుండా ప్రవహిస్తున్నది. మేవార్‌కొండలలోనుంచికూడా పోతున్నది. దన్‌గర్‌పూర్ బన్‌స్వాడాజిల్లాలమధ్య సరిహద్దు ఏర్పర్చుతూ,గుజరాతులో ప్రవేశించినతరవాత కైరా, బరోడాజిల్లాలమధ్యనుంచి ప్రవ

హిస్తున్నది. ఈ నదికి కుడివైపున కైరాజిల్లాయున్నూ, ఎడమవైపున పంచమహల్, బరోడాజిల్లాలున్నూఉన్నాయి. ఇంకా పశ్చిమానికి పోతే నదికికుడిప్రక్కన కాంబే, ఎడమ ప్రక్కన బ్రోచ్ జిల్లాలు తగులుతాయి. నది మొదట్లో కొంత లెక్క బాగా వెడల్పుగా ఉన్నప్పటికీ లోతుమాత్రంతక్కువ. మామూలుగావుండే పరిస్థితి ఇది. అయితే, వర్షాకాలంలో అలాకాదు. వర్షాలుపడుతున్నప్పుడు నదిలో నీరు బాగా పైకి పెరుగుతుంది. సముద్రానికి ఇంకా 45మైళ్ళదూరం ఉన్న దనగా—నది ఆటూ—పోటులతో మహావేగంగా ప్రవహిస్తుంది. సముద్రానికి 30 మైళ్ళదూరంలోవున్న ధేవన్ నగరంవద్ద ఒక పెద్ద కయ్యను ఏర్పరుస్తున్నది. తరవాత కాంబేసింధుశాఖవద్ద సముద్రంలో కలుస్తున్నది. కాంబే నుండి 'కావి' వరకూ నదీతీరంపొడవు సుమారు అయిదు మైళ్ళు. ఇరుదరులా చాలా ఎత్తున ఒండ్రుమట్టిని చేర్చి, అగాధమైన లోయలను ఏర్పరుస్తున్నది ఈ నది. వరదలు వచ్చేకాలంలో—ధేవన్‌దాకా దాదాపు పాతికమైళ్ళదూరం నదికి ఈ ఒడ్డునా ఆ ఒడ్డునా ఆరుఅడుగులఎత్తున నురుగుతో నిండిన జలం పైకితేస్తుంది.

మహీనది, ఎక్కడెక్కడి ప్రాంతాలనుండో విపరీతంగా ఒండ్రుమట్టిని తెచ్చి, గుజరాతును సారవంతం చేస్తున్నది.

మహీనదినిగురించి పురాతనకథలు చాలావున్నాయి.

ఉజ్జయినిని పాలించే ఇంద్రద్యుమ్నుడనేరాజు దేహంనుండి వచ్చిన చెమటవలన పుట్టించినది అని చెపుతారు. మహీ పతిపుత్రిక కనుక దీనికి మహీ అని పేరువచ్చిందని మరొక కథకూడా ఉన్నది. పూర్వం ఒక గుజరాతీపడుచు - రోజూ పెరుగుచిలుకుతూవుంటే—ఒకయువకుడు ఆ పిల్లవైపే చూస్తూవుండేవాడట! అయినా ఆ అమ్మాయి అతనివంక కన్నెత్తిచూడలేదు. ఒకనాడా యువకుడు ఆమెవంక రెప్పవాల్చకుండా చాలసేపు చూడడం మొదలుపెట్టాడు. అకస్మాత్తుగా ఆ అమ్మాయి ఇది కనిపెట్టింది. అతను తనవైపు చూస్తున్నాడని తెలుసుకున్నది. అతని బారినుండి తప్పించుకోడానికి అక్కడున్న పెద్ద పెరుగుటానలో దూరింది. అప్పుడు పెరుగుబానలో పెరుగు పైకి పొంగి వచ్చింది. అది ఒక నదిఅయి ప్రవహించింది. ఇంకొక విషయంకూడా చెపుతారు—ఈ నది మెహద్‌సరస్సునుండి పుట్టిందికనుక దీనికి మావ్, మాహూ, మాహీ, మేండా - అను పేర్లువచ్చాయని అంటారు.

మహీనదికి ఇరుదరులా ఉన్న లోయలలో పూర్వం భయంకరమైన కొండజాతులవాళ్లు కొందరుండేవాళ్ళు. వాళ్లు ఘాతకులు. అందువల్ల ఈ నదిని దాటాలంటే జనానికి అమిత భయంగా ఉండేది. నదిని దాటవచ్చే జనం వీళ్ళచేతుల్లోపడక తప్పదు. వీళ్ళు మనుష్యులను చంపి సొమ్ములు వలచుకునేవాళ్లు. నదిని దాటాలంటే జనానికి

మరొక భయంకూడా ఉండేది. ఉన్నట్టుండే ఈ నదికి క్షణంలో వరదలువచ్చేవి. ఇదొక తగనిభయం జనానికి. ఈ నదీతీరంలో భిల్లులు, కోలులు—అనే కొండజాతుల వాళ్లు నివసించేవారు. ఈ నదిని మహీసాగరం అని పిలవడమేకాక—దేవతగా, తల్లిగా భావించేవారు. నదికి పూజలు చేసి, బలులుఇచ్చేవారు. నదిమీద—మిన్‌గ్రాడ్, ఫజ్లీపూర్ అన్‌గాడ్, యాస్‌పూర్—అనే నాలుగుప్రదేశాలు తీర్థయాత్రాస్థలాలు. ముఖ్యంగా వాళ్ళు చైత్రమాసంలో పూర్ణిమనాడు ఈ స్థలాలకువెళ్ళి నదీదర్శనం చేసుకునేవాళ్లు. భిల్లులు కోయలు, పతన్‌వాడులు—ఏదైనా అవసరంవస్తే ఈ నది పేరుమీద ఒట్టుపెట్టుకునేవారు. ఎంతటి ప్రమాదంవచ్చినా సరే నదిమీద ఒట్టుపెట్టుకున్నతరవాత తప్పరు.అంతేకాదు, ఆ జాతులవారిలో మరొక నమ్మకంకూడా వుండేది. తమ వారిలో ఎవడైనా చెయ్యరానితప్పుచేస్తే వాడికి మహీనది నీరు తాగమని ఇచ్చేవారు. వాడు నిజంగా తప్పుచెయ్యనట్టయితే ఆ నీరు త్రాగగలిగేవాడు. అలాకాక తప్పుచేశాడా— ఆ నీరు వాడికడుపులో ఇమడదు—బయటికి కక్కివేసేవాడు. తప్పుచేసినట్లు అదే గుర్తు. సమయం వచ్చినప్పుడు హిందువులలో అనేకమంది 'భగవద్గీత' ముట్టుకొని ఎలా ప్రమాణంచేస్తారో, అలాగే ఈ ప్రజలు మహీనదిలోనీరు ముట్టుకుని ప్రమాణాలుచేసేవారు.

ప్రమాణాలనుబట్టి చూస్తే, మహీనది చాలా పవిత్ర

మైనదేకాక, మహాభయంకరమైనదనికూడా తెలుస్తున్నది. ఈ నది అకస్మాత్తుగా పొంగి, భయంకరమైన వరదలు రావడంవల్ల దీనికి మహీసాగరం అని పేరువచ్చింది.

దీనిని ఇంకా పద్దెనిమిదిపేర్లతో వర్ణించాయి మన పురాణాలు. తామ్రనది, మహాసింధు, ఉజ్జయినీరాజతనయ. మహీసుత, పశ్చిమవాహినీగంగ, రాజనది—మొదలగు పేర్లతో ఈ నదినిగురించి చెప్పాయి.

చిన్నచిన్న ఉపనదులు అనేకం వచ్చి మహీనదితో కలుస్తున్నాయి. వాటిలో శోణ, జకం, అనాస. భాదరు— అనేవి ముఖ్యమైనవి. మహీ, నర్మదానదులుమధ్యనున్న భూమిని మహీవాస—అని పిలుస్తారు. పర్వతమయమైన ఈ ప్రదేశంలో ధైర్యసాహసాలుకల గొప్పగొప్ప వీరులు జన్మించినట్లు తెలుస్తున్నది. ముస్లించరిత్రకారులుకూడా ఈ విషయాన్ని తెలియచేశారు. మహీనది ఇరుదరులా వున్న భూమి మిక్కిలి సారవంతమైనది. ముఖ్యంగా కైరాజిల్లాలో భూమి పుష్కలమైన పంటను ఇస్తున్నది. నదీతీరమందు గొప్ప వీరులూ, ధైర్యశాలులూ జన్మించారు. మహీనదిముఖద్వారంచెంత శివుడు అంధకాసురుణ్ణి సంహరించినట్లు శివపురాణం చెపుతున్నది.

దేవన్‌పట్టణంప్రాచీనకాలంలో ప్రసిద్ధమగు రేవుపట్టణం. మహీనది కాంబేసింధుశాఖలోకలిసేప్రదేశాన్ని మహీసాగర సంగమ క్షేత్రమనీ, గుప్తక్షేత్రమనీ పిలుస్తారు. ఇది తీర్థ

యాత్రాస్థలం. స్కాందపురాణాంతర్గత మహేశ్వరఖండలో ఉపఖండమైన కౌమారికాఖండం—మహీనదినిగురించి విపులంగా వర్ణించిచెప్పింది. ఈ నదిమీద అనేక పుణ్యతీర్థాలున్నట్లు పేర్కొన్నది. మహీసాగరసంగమతీర్థమహాత్మ్యం అనుపేర ఒక అధ్యాయం సాంతం వర్ణించబడింది. మహీనదీతీరంలో శ్రాద్ధాలుపెట్టినా, తర్పణాలువిడిచినా పలుతరాల పితృదేవతలు తరిస్తారు. ఇక్కడ చేసిన దానం అల్పమైనా సరే, అత్యధికమైన పుణ్యాన్ని ప్రసాదిస్తుంది. మహీనది సాగరంలో కలిసేచోట స్తంభతీర్థం ఉన్నది. స్తంభతీర్థంలో స్నానమాడి స్తంభేశ్వరుణ్ణి సేవించినవారిపుణ్యం అంతా ఇంతా కాదని స్కాందపురాణం చెపుతున్నది. స్కందుడు (కుమారస్వామి) తారకాసురుణ్ణి సంహరించినది ఇక్కడే. తారకాసురుడు గొప్ప శివభక్తుడు. అతన్ని చంపినపాపం పోవడానికి స్కందుడు ఇక్కడ మూడు శివలింగాలు ప్రతిష్ఠించాడు మహాబలవంతుడగు తారకాసురుణ్ణి జయించి గురుతుగా జయస్తంభంకూడా ప్రతిష్ఠించాడు. అందుకే దీనికి స్తంభతీర్థమనీ, ఇక్కడిదేవునికి స్తంభేశ్వరుడనీ పేర్లువచ్చాయి. ఏమైనా ఇది గొప్ప శివక్షేత్రం. అసలు గుజరాతుదేశమే ప్రాచీనకాలంనుండీ శైవమతానికి ప్రసిద్ధికెక్కింది. పూర్వకాలంనుండీ గుజరాతు దేశస్థులఇష్టదైవం పశుపతి. పాశుపత మతస్థాపకుడగు నకులేశుడు, బరోడాకు సుమారు పన్నెండుమైళ్ళదూరంలోవున్న కారవానులోనే నివసించాడు.

స్కాందపురాణాంతర్గత కౌమారికాఖండంలో మహీ నది జన్మించడానికి కారకుడగు ఇంద్రద్యుమ్నరాజుకథ కూడా వర్ణితమైంది. రాజస్థాన్‌లోని బాణేశ్వరవద్ద మహీ, శోణానదులు కలిసేచోట గొప్ప శివాలయం ఉన్నది. ఏటేటా ఇక్కడ గొప్ప ఉత్సవాలు జరుగుతుంటాయి.

మహీనదినుండి భూములకు నీరుపారుదలఏర్పాట్లు చేశారు. కాలువలు త్రవ్వారు. కైరాజిల్లాలో తస్రా తాలూకాలోని వనల్‌బోరీవద్ద మహీనదిపైన ఆనకట్ట కడుతున్నారు. దీనిపొడవు 2,610 అడుగులు. ఇంకా నీటి పారుదలపథకాలు అనేకం ఆలోచనలో ఉన్నాయి. కొన్నిపథకాలు రెండవపంచవర్షప్రణాళికలో చేర్చబడినాయి. ఈ ప్రాజెక్టులు పూర్తిఅయితే 4 లక్షల 47 వేల ఎకరాలభూమికి నీరుపారి, సాగుఅవుతుంది. ఇంకా చిన్న చిన్న కాలువలు అనేకం తీయడానికి ప్రయత్నాలు చురుకుగా సాగుతున్నాయి. మహీనదిమీద 'కడన' రిజర్వాయరు కట్టేపథకంకూడా ఆలోచనలో ఉన్నది.



# లూనీ

యూనీనది అజ్మీర్ వద్ద నైఋతిదిశగాఉన్న కొండల నుండి బయలుదేరి వస్తున్నది. దీనిఉత్పత్తిస్థానం 26°.25' ఉ. అక్షాంశ, 74°.34'తూ. రేఖాంశలమీద ఉన్నది. లూనీ నదిని ఉప్పునది అంటారు. ఈనది అసలుపేరు లవణావతి. లవణంఅంటే ఉప్పులవణంనుండే లవణావతి అనుపేరు ఉత్పన్నమై, చివరకు లూనీ అయినట్లు తెలుస్తున్నది. బయలుదేరినచోటునుంచి కొంతదూరందాకా ఈ నదికి సాగరమతి అనిపేరు. తరవాత తరవాత చివరకు వచ్చి నప్పుడే దీనిని లూనీనది అని పిలుస్తారు. ఆరావళీపర్వతా లలో జన్మిస్తున్న అనేక చిన్నచిన్ననదులు వచ్చి లూనీ నదిలో కలుస్తున్నాయి. ఈ నది అజ్మీర్ వద్దనున్న బిసాల్ సరస్సులోపుట్టి—మొదట ఉత్తరదిశగా వచ్చి ఆతరవాత గోవిందగర్ పక్కనుంచి ప్రవహిస్తున్నది. అటుపిమ్మట, పుణ్యప్రదమగు పుష్కరతీర్థంనుంచి వస్తున్న సరస్వతీ నదితో కలుస్తున్నది. అలా సరస్వతీనదితో కలిసిన తర వాతనే, అంతవరకూ సాగరమతి అను పేరుతోవున్న ఈ నది అక్కడనుంచి లూనీఅనుపేరుతో పిలువబడు తున్నది. అటుపిమ్మట ఈ నది రాజస్థాన్ప్రాంతంగుండా (పూర్వపు జోధ్పూర్ రాష్ట్రంలో కొంతభాగంగుండా)పోతు న్నది. ఈప్రాంతానికి మరుస్థలి అని పేరు. అదే మార్వార్

అను పేరుతో పిలువబడుతున్నది. లూనీనది మొత్తం పొడవు సుమారు 320మైళ్ళు. మార్వార్‌గుండా ప్రవహించినతరవాత చివరకు ఈ నది కచ్‌సింధుశాఖలో కలిసిపోతున్నది. ఆ చోటు సరిగ్గా గుర్తించాలంటే, సుమారు 24౦.40'ఉ. అక్షాంశ, 71౦.15'తూ. రేఖాంశలమీద ఉన్నదని చెప్పవచ్చును.

లూనీనదికి చిన్నచిన్న ఉపనదులు అనేకంవున్నాయి. వాటిలో లిలీ్రి, రాయపూర్‌లూనీ, గుహియా, బండీ, సుక్రీ, జవాయ్, జోడ్రీ—అనేవి ముఖ్యమైనవి. వీటిలో ఎక్కువ నదులు అజ్మీరు,ఆబూలమధ్యనున్న ఆరావళీపర్వతపంక్తుల పశ్చిమభాగంనుండి నీటినితెస్తున్నాయి.లూనీ,దానిఉపనదులు ఎక్కడెక్కడనుండీ తెస్తున్న అపారమగు ఒండ్రుమట్టి వలననే—మార్వారులోని దక్షిణపుజిల్లాలు మిక్కిలి సారవంతంగా ఉంటున్నాయి. మార్వార్‌లో పశ్చిమాన థార్ పార్కర్‌జిల్లా ఉన్నది. నైఋతీభాగాన కచ్‌సింధుశాఖ ఉన్నది. మరుస్థలినే మార్వార్ అంటున్నాంకదా. మరుస్థలి అంటే—ఇసుకభూమిఅని అర్థం—కనక ఇది పంటలు పండని—ఎడారిభూమిఅని యీమాటవల్లనే మనకు తెలిసిపోతున్నది. అయినప్పటికీ,మార్వారులో తూర్పు,ఆగ్నేయ భాగాలలో భూమి సారవంతంగా వుంటున్నది. ముఖ్యంగా ఆరావళీపర్వతాల చుట్టుప్రక్కల భూమి మిక్కిలి సారవంతమైన భూమి. ఇందుసకారణం లూనీ, దానిఉప

నదులూ యీ ప్రాంతంలో ప్రవహించడమే. వాస్తవానికి మార్వార్‌లో మహాఎడారి లూనీనదికి పైగా అటుప్రక్క ప్రారంభమై వుత్తరదిశకు వ్యాపిస్తుంది. మార్వార్‌లోని వ్యవసాయోత్పత్తిలో సగభాగం లూనీనదివల్లనే జరుగుతు న్నది. ముఖ్యంగా దక్షిణమార్వార్‌కు యీ నది ఒక వరప్రసాదంలాంటిది. ముఖ్యంగా వానాకాలంలో యీ నదినిండా నీరువుంటుంది. వేసవికాలంలో నది చాలావరకు ఎండిపోతుంది. అప్పుడా ప్రదేశంలో దోసకాయలు మొదలగునవి సమృద్ధిగా పండిస్తున్నారు. వర్షఋతువులో ఒక్కొక్కప్పుడు యీ నది పొర్లి ప్రవహిస్తుంది. గోధుమ, బార్లీ పైరులకు ఎంతో వుపయోగపడుతున్నది.

కచ్‌సింధుశాఖను సమీపిస్తున్నకొద్దీ యీ నదిలో నీరు వుప్పగా మారిపోతున్నకారణాన దీనిని లవణానది లేక లూనీ అని పిలుస్తూవచ్చారు. నదిలోనీరు ఇలావుప్పగా వున్నప్పటికీ—నదిఒడ్డున బావులు త్రవ్వితే తియ్యటి మంచి నీళ్లు పడతాయి. ఆవిధంగా నదికి ఇరుదరులా అనేక బావులు త్రవ్వారు. మోటద్వారా బావులనుండి నీళ్లతోడి పొలాలకు వుపయోగిస్తున్నారు. బిలారావద్ద నదిమీద ఒక ఆనకట్ట నిర్మించబడింది. జస్వంత్‌సాగర్ అను ఒక కృత్రిమ సరస్సునుకూడా నిర్మించారు. పూర్వం జోధ్‌పూర్‌ను పాలించిన జస్వంత్‌సింహునిపేరు పెట్టారు యీ సరస్సుకు. ఈ కృత్రిమసరస్సునుండి వచ్చే నీటిమూలంగా అనేకఎకరాల

భూమి సాగుఅవుతున్నది. ఈ నదియొక్క ఉపనదులు అనేకం, ఆరావళీపర్వతాల పశ్చిమభాగంనుండి మిక్కటంగా నీరును తెస్తున్నాయి. ఆరావళీపర్వతాలు, పారియాత్ర పర్వతపంక్తులలో ఒకభాగమని చెపుతారు. సప్తకుల పర్వతాలలో పారియాత్రపర్వతం ఒకటి. పురాణాలనుబట్టి చూస్తే, అనేక పుణ్యనదులు—పర్ణాశ లేక వారణాసి (దీనినేబనాసనదిఅనికూడా అంటారు)తోసహా, యీపర్వత పంక్తులనుండే బయలుదేరి వస్తున్నాయి.

లూనీకిగల ముఖ్యఉపనదులలో లిల్రీనది ఒకటి. ఆరావళీపర్వతాలలో బియావర్‌కు పశ్చిమదిశనుండి బయలుదేరివస్తున్నది యీ నది. రాయపూరు లూనీఅను మరొక చిన్నప్రవాహం మేవాడకొండలనుండి పుట్టి, రాయపూరు గ్రామంప్రక్కగుండా ప్రవహించి తుదకు లూనీనదితో కలుస్తున్నది. గుహియా లేక గుహ్యాబలా అను మరొక ఉపనది దునారావగ్గర లూనీనదితో చేరిపోతున్నది. ఈనది మీద సర్దార్—సమంత్ అను ఒక పెద్ద తటాకం నిర్మించారు. దీని సహాయంవలన యీ ప్రాంతంలో అనేక ఎకరాలభూమికి నీరు లభిస్తున్నది.

జోధ్‌పూర్‌కు పశ్చిమాన సుమారు 32 మైళ్ళ దూరంలో సముజేశ్వరతీర్థంవున్నది. ఈ ప్రదేశానికి సుమారు ఒకమైలుదూరంలో లూనీనది ప్రవహిస్తున్నది. సముజేశ్వరతీర్థంలోని ఆలయం చాలా పురాతనమైనదని

ప్రసిద్ధి. ఇక్కడ అనేక శాసనాలుకూడావున్నాయి. ఈ ఆలయంలో ఏటేటా శ్రావణమాసంలో తొలి సోమవారం నాడు ఉత్సవం జరుగుతూవుంటుంది. ఈ ప్రదేశానికి సమీపంలో ధూన్‌దాడాఅనే పట్టణం వున్నది.ఇక్కడ వీరేశ్వర, లూనకేశ్వర—అను రెండు ప్రసిద్ధదేవాలయాలు ఉన్నాయి. ఇక్కడికి సుమారు నాలుగుమైళ్ళదూరంలో లూనీనదిమధ్య యోగేంద్రభారతిమఠం వున్నది.

మార్వారుజంక్షన్‌నుండి—లూనీజంక్షన్‌కు రైలు పోతుంది. లూనీ జంక్షన్‌నుండి ఒక రైల్వేలైను బరుమేరు స్టేషనుకు వెళుతుంది. లూనీగుండా మార్వారుజంక్షన్‌కు వెడితే జోధ్‌పూర్‌కుకూడా పోవచ్చును.

లూనీనది సరస్వతీనదితో కలిసే ప్రదేశం గొప్ప పుణ్యతీర్థమని చెపుతారు. ప్రసిద్ధమగు గంగా, యమునా, సరస్వతీ—అను మూడునదులలో ఒకటిఅగు సరస్వతీనది పుష్కరసరోవరంనుండి బయలుదేరి లూనీనదితో కలుస్తున్నది. పుష్కరతీర్థం గొప్ప పుణ్యతీర్థంగా పురాణాలు వర్ణించిచెప్పాయి.

# దామోదర్

గంగానది ఉపనదులలో దామోదర్‌నది ఒకటి. ఇది తూరుపుదిశనుండి వచ్చి గంగానదితో కలుస్తున్నది. బీహారు, పశ్చిమబెంగాల్ రాష్ట్రాలగుండా ప్రవహిస్తున్నది. ఛోటా నాగపూరులోని జలాధారంనుండి—23°.37' ఉ. అక్షాంశ, 84°.47' తూ. రేఖాంశలమీద జన్మిస్తున్నది యీ నది. దాదాపు 368 మైళ్ళదూరం పోయిన తరవాత, చివరకు ఇది హుగ్లీనదిలోకి చేరిపోతున్నది. ఇది హుగ్లీనదిలో చేరిపోయే చోటు 22°.17' ఉ. అక్షాంశ, 88 .5' తూ. రేఖాంశలమీద వున్నది. ఈ ప్రదేశాన్ని 'జేమ్సు అండ్ మేరీ సాండ్సు' అని పిలుస్తారు. పై భాగంలో బరకారా, కోనార్ అను రెండు చిన్న ఉపనదులు వచ్చి దామోదరనదిలో కలుస్తున్నాయి.

పుట్టుక స్థానంవద్ద దామోదరనది రెండుమొనలుగల ఒకపాయగా ఏర్పడుతున్నది. ఈ రెండుమొనలలో దక్షిణపు మొనయే యీ నదివుత్పత్తిస్థానమని చెపుతారు. ఇది పాలమావ్ జిల్లాలో వున్నది. ఉత్తరపుమొనను గరిహీ అని అంటారు. యీ రెండుమొనలనుండీ బయలుదేరిన సన్నని జలవాహినులు చివరకు హజారీబాగ్ జిల్లాలో ఒకటిగా చేరిపోతాయి. అక్కడనుంచి నది తూరుపు దిశగా మాన్‌భూమ్‌జిల్లాలోగుండా పోయి, తన పెద్ద వుపనదియగు బరకారానదిని కలుపుకుంటుంది. అక్కడ

నుంచి ఆగ్నేయదిశకు మళ్ళి అటుపిమ్మట బరద్వాన్ జిల్లాలో ప్రవేశిస్తుంది. బంకానదిమీదవున్న బరద్వాన్ పట్టణానికి సమీపంగానే ప్రవహిస్తుంది. బంకానది, ఖారి నదికి వుపనది. యీ రెండూ కలిసిన ప్రవాహం చివరకు భాగీరథీ (గంగ) నదితో చేరిపోతున్నది. ఆ తరవాత దామోదరనది ఇంకా ఇంకా పోయి బరద్వాన్ హుగ్లీజిల్లాల గుండా పోతుంది. హుగ్లీజిల్లాలో ప్రవేశించేముందు యీనదికి ఒకడెల్టా ప్రారంభమవుతున్నది. ఇక్కడనుంచి అనేక ప్రవాహాలు అనేక వైపులకు పోతాయి. దామోదరనది రాణీగంజ్, అండాల్, కస్బాగోహగ్రాం, గోపాల్పూర్, జమాల్పూరు, సాలిమాబాద్ మొదలయిన పట్టణాలగుండా పోతున్నది. సాలిమాబాద్పట్టణం—కానానది దామోదర నదితో కలిసేచోట వున్నది. దామోదరకు కానా ప్రధాన మగు నదీశాఖ. హజారీబాగ్జిల్లాలో దామోదరనది సముద్రమట్టానికి సుమారు పదమూడువేలఅడుగుల ఎత్తున ప్రవహిస్తుంది. కాని అక్కడనుంచి సుమారు వందమైళ్ల పోయినతరువాత దీనిఎత్తు 582 అడుగులుమాత్రమే. నది ఎగువభాగాన ఒండ్రుమట్టి విపరీతంగా చేరుతున్నది. కాని, బీహారుప్రాంతానికి వచ్చేటప్పటికిమాత్రం కొంతభాగం ఏమీవుండదు. అంతా బీడుగానే వుంటుంది. అయినప్పటికీ, యీప్రాంతం గొప్ప ఖనిజసంపదకు ప్రసిద్ధిగావున్నది.బీడు గావున్న ప్రాంతంలో వాననీరుకూడా ఎక్కువగా భూమిలో

ఇంకదు. అందువల్ల యీ నదీజలాలు ఎక్కువభాగం నిరుపయోగమైపోతున్నాయి. వేసవికాలంలో హౌరాజిల్లాలో కొద్దిదూరంమాత్రమే నదిమీద నావల రాకపోకలకు వీలుగా ఉంటున్నది. వర్షాకాలంలోమాత్రం బరకారానదితో కలిసే ప్రదేశంవరకూ దామోదరనదిలో చిన్న చిన్న పడవలమీద రాకపోకలు సాగించవచ్చును.

దామోదరనదిలో చిన్నచిన్నపడవలమీద రాణీగంజ్ గనులనుండి బొగ్గునువేసి, హుగ్లీనదిమీదుగా కలకత్తాకు చేరవేస్తారు.

ఈ నది కొండలనుండీ, పీఠభూమినుండీ విపరీతంగా వాననీరు తీసుకువస్తూఉండడంవల్లా, బీడుభూముల్లో నీరు ఇంకిపోవడానికి వీలులేనందువల్లా దిగువభాగానికి వచ్చేటప్పటికి నదికి విపరీతంగా వరదలువస్తాయి. వర్షాకాలంలోవచ్చే ఈ నదివరదలవలన బీహారు, పశ్చిమ బెంగాలురాష్ట్రాలకు అంతులేని నష్టంవాటిల్లుతున్నది. ఈ వరదలమూలంగా బీహారు ఎన్నోతడవలు అంతులేని నష్టానికి గురిఅయింది. అందువల్లనే దామోదరనదికి 'బీహారు దుఃఖదాయిని' అని పేరు. క్రీ. శ. 1770లో ఈ నది వరదలమూలంగా బరద్వాన్‌పట్టణం పూర్తిగా ధ్వంసమైపోయింది. అంతులేని ఆస్తినష్టం. ప్రాణనష్టం సంభవించింది. అలాగే క్రీ. శ. 1823, 1855 లలోకూడా వరదలు వచ్చి, గొప్ప నష్టాన్ని కలిగించాయి. వరదలప్పుడు ఈ

నదీతరంగాలు 5.6 అడుగుల ఎత్తున పైకి లేస్తాయి. 18 వ శతాబ్దంలో పదేపదే వరదలువచ్చిన కారణాన ఈ నదీమార్గంకూడా మారినట్లు తెలుస్తున్నది. అయితే ఈ వరదలు అంతులేనినష్టం కలిగించడంతోపాటు కొంత లాభాన్నికూడా సమకూర్చిపెట్టాయి. వరదలవల్ల నది ఈ ప్రాంతంలో ఎక్కువగా ఒండ్రుమట్టిని తెచ్చిపెట్టి, భూమిని సారవంతంచేసింది. ఏమైనప్పటికీ పదేపదే ఆస్తి ప్రాణ నష్టాలు కలిగిస్తూరావడంవలన దామోదరనదీవరదలను అరికట్టవలసిన అగత్యం ఏర్పడింది. ఈ సమస్య ప్రభుత్వాధికారులను నిరంతరం కలవరపెడుతూవచ్చింది. నదికి ఇరువైపులా పెద్దపెద్ద కట్టలుపోసినప్పటికీ విపరీతంగా వరదలురావడంవల్ల ఈ కట్టలకు తరుచు గండ్లుపడుతూ వచ్చాయి. వరదలను అరికట్టడంతోపాటు, నదీజలాలను పొలాలకు అందేటట్లుచేసి, పంటలు పండించడమూ, నదిలో రాకపోకలకు వీలుకలిగించడమూ, విద్యుచ్ఛక్తిని ఉత్పత్తిచేయడమూ, నదివరదలవల్ల భూమి కోతలుపడి హరించుకపోవడాన్ని ఆపడమూ - మొదలయిన చర్యలు ఎన్నో తీసుకోవలసినఅవసరం ఏర్పడింది. ఈ ప్రయోజనాలన్నీ సాధించడంకోసం, ప్రభుత్వంవారు క్రీ.శ. 1946 లో ఒక నిర్ణయంతీసుకున్నారు. అమెరికన్ 'టెన్నెసీ వ్యాలీ అథారిటీ' వారి ఇలాకాన ఈ నదికి కొంత పనిచేయడానికి నిర్ణయించుకున్నారు. కీ.శ.1948లో దామోదరవ్యాలీ కార్పొ

రేషన్ ఆక్టు చేయబడింది. కార్పొరేషన్‌వారు బహు ప్రయోజనపథకాన్ని కొనసాగించడానికి పూనుకున్నారు. ఈ ప్రాజెక్టు పశ్చిమబెంగాల్, బీహార్ రాష్ట్రప్రభుత్వాలు, కేంద్ర ప్రభుత్వాల సమష్టిఆధ్వర్వాన కొనసాగింది. ఈప్రాజెక్టుక్రింద ఖర్చు సుమారు 103.73 కోట్ల రూపాయలని అంచనా వేశారు. నదిమీద వేరువేరుప్రదేశాలలో ఎనిమిది ఆన కట్టలు నిర్మిస్తున్నారు. హైడ్రో ఎలెక్ట్రిక్ పవరుస్టేషన్లు కూడా కడుతున్నారు. ఒక పెద్ద థర్మల్ ఫవర్‌స్టేషను కూడా నిర్మిస్తున్నారు. అనేక పంటకాలువలుతీసి—— ఒకపెద్ద బేరేజ్‌కూడా నిర్మాణంచేస్తున్నారు. ఈ ప్రాజెక్టు పూర్తిఅయితే — బీహార్, పశ్చిమబెంగాల్ రాష్ట్రాలలో 11,41,000 ఎకరాలభూమికి నీటివసతి లభించడమేకాక— 2,74,000 కిలోవాట్ల జలవిద్యుచ్ఛక్తికూడా ఉత్పత్తిఅవుతుంది. పంటకాలువలు అనేకం దాదాపు 85 మైళ్ళ పొడవున వ్యాపించిఉంటాయి. ఇవి నావలరాకపోకలకు ప్రయాణసౌకర్యాలకూ ఉపయోగపడతాయి. రాణీగంజ్ బొగ్గుగనులనుండి కలకత్తాకు — బొగ్గు మొదలయినవి చేరవేయడానికి చక్కటిమార్గం ఏర్పడుతుంది. దామోదర లోయప్రాజెక్టువలన వ్యవసాయోత్పత్తిదారులకు 6 కోట్ల రూపాయిలు అదనంగా లాభంచేకూరుతుందని అంచనా వేస్తున్నారు. అంతేకాదు. నది ప్రవహించే ప్రాంతం అంతాకూడా లోయలు, అడవులు, పొలాలు, గనులు, యంత్రపరిశ్రమలు— అన్నీ అభివృద్ధిచెంది, బాగా వికా

సించే అవకాశం కలుగుతుంది. నదివరదలు అరికట్టబడ తాయి. నదిలో సంవత్సరంపొడుగునా పుష్కలంగా నీరు ఉంటుంది.

మొదటి పంచవర్షప్రణాళికాకాలంలో తిలైయా, కోనార్‌లవద్ద ఆనకట్టలు పూర్తి కావించబడినాయి. పశ్చిమబెంగాల్‌లోని దుర్గాపూర్‌వద్ద బేరేజీ, బీహార్‌లోని బొఖారోవద్ద థర్మల్‌పవర్‌స్టేషన్‌ల నిర్మాణంకూడా పూర్తి అయింది. ఈ పవరుస్టేషన్ ప్రపంచంలోని పెద్ద విద్యుచ్ఛక్తికేంద్రాలలో ఒకటిగా రూపొందింది. దామోదర వ్యాలీప్రాజెక్టులో మైథన్‌వద్ద కట్టిన ఆనకట్ట చాలా పెద్దది. ఇది 1957 లో పూర్తిఅయింది. 1957 సెప్టెంబరు 22 వ తేదీన భారతప్రధాని పండిత నెహ్రూ దీనికిప్రారంభోత్సవం చేశారు. 'పంచత్‌హిల్ ఆనకట్ట' యున్నూ, పవరుస్టేషనున్నూ నిర్మాణంలో ఉన్నాయి. దామోదరనదియొక్క 'ఈడెన్‌కెనాల్' క్రీ. శ. 1881లో నిర్మాణమయింది.

సంథాలులు అనేజాతివారు దామోదరనదిని దేవతలా భావించి, ఎంతో భక్తితో పూజిస్తారు. దామోదర, కాసైల మధ్యనున్నభూమిని వీరు తమ స్వదేశంగా భావిస్తారు. చనిపోయినవారిని దహనంచేయగా మిగిలిన అస్థికలను వీరు ఈ నదిలో కలిపివేస్తారు. దీనివలన పుణ్యంవస్తుందని వారినమ్మకం. ఈ నదిని సముద్రం అని పిలుస్తారు.

---

# మహానది

మహానదిఒరిస్సా రాష్ట్రంలో ప్రవహిస్తున్నది. ఇది
ుర్ కొండలకు ఉత్తరాన కంకార్ కొండలవద్ద సుమారు
0౦.19'ఉ. అక్షాంశ, 86౦.45'తూ. రేఖాంశలమీద పుట్టి,
టానాగపూరు పీఠభూమిని దాటి, తూర్పుతీరమైదానానికి
చ్చి తుదకు బంగాళాఖాతంలో పడుతున్నది. మహానది
ఉపనదులలో బ్రాహ్మణి, వైతరణీనదులు ముఖ్యమైనవి.

ఒరిస్సాకు ముఖ్యపట్టణమగు కటక్‌వద్ద మహానది
అనేక పాయలుగా చీలి,సారవంతమగు డెల్టాను ఏర్పరుస్తు
న్నది. నదీముఖద్వారంనుండి ఎగువకు సుమారు 300
మైళ్ళదూరం పడవల రాకపోకలకు అనుకూలంగాఉన్నది.

మహానదిపైన ఒరిస్సారాష్ట్రంలో హీరాకుడ్
ప్రాజెక్టు నిర్మిస్తున్నారు. ఇది ఒరిస్సాలోని సంబల్‌పూర్
రైల్వేస్టేషన్‌కు ఎగువన సుమారు 6 మైళ్ళదూరంలో
మహానదిమీద ఉన్నది. ఇది చాలా పెద్దఆనకట్ట. ఈ ఆన
కట్టపొడవు సుమారు 3 మైళ్లు. ఎత్తు సుమారు 200
అడుగులు. ఇంతపొడవైన ఆనకట్ట ప్రపంచంలో లేదు.
ఇక్కడ జలాశయం వైశాల్యం సుమారు 250చ. మైళ్ళు.
హీరాకుడ్ ప్రాజెక్టువలన ఒరిస్సాలోని సంబల్‌పూర్,
బొలంగిర్ జిల్లాలలో 6.72లక్షల ఎకరాలభూమికి నీటివసతి
లభిస్తుంది. కటక్, పూరీజిల్లాలలో 18.7 లక్షలఎకరాల

భూమి ఈ నీటిక్రింద సాగుఅవుతుంది. ఆనకట్టవద్ద విద్యుత్కేంద్రంకూడా నిర్మిస్తున్నారు. దీనివలన 1,2 కిలోవాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పత్తికాగలదు.

హీరాకుడ్ప్రాజెక్టులో మొదటిదశ పని పూర్తిఅయిపోయింది. ఇప్పుడు రెండవదశలో పని చురుకుగా సాగిపోతున్నది. ఇంకా అదనంగా జలవిద్యుచ్ఛక్తి ఉత్పత్తిచేయడానికి ఏర్పాట్లు జరుగుతున్నాయి.

పూర్వం అప్పుడప్పుడు మహానదికి వరదలువచ్చి ఎంతో నష్టం సంభవిస్తుండేది. ఇప్పుడు నదీజలాలను అడ్డుకట్టి ఆ ఆపదను తొలగిస్తున్నారు. మహానది ఒరిస్సా రాష్ట్రంలో వ్యవసాయం అభివృద్ధికావడానికీ, పరిశ్రమలు వికసించడానికీ మిక్కిలి ఉపయోగపడుతున్నది.



# నవీన బాలసాహిత్యము

| | | | |
|---|---|---|---|
| మన చారిత్రక ప్రదేశాలు | 1 భాగం | రెంటాల | 0.87 |
| మన చారిత్రక ప్రదేశాలు | 2 భాగం | ,, | 0.87 |
| మన చారిత్రక ప్రదేశాలు | 3 భాగం | ,, | 0.87 |
| మన చారిత్రక ప్రదేశాలు | 4 భాగం | ,, | 0.87 |
| మన నగరాలు | 1 భాగం | ,, | [illegible] |
| మన నగరాలు | 2 భాగం | ,, | [illegible] |
| మన నగరాలు | 3 భాగం | ,, | [illegible] |
| మన నగరాలు | 4 భాగం | ,, | [illegible] |
| మన పుణ్యక్షేత్రాలు | 1 భాగం | దంటు కృష్ణమూ[illegible] | [illegible] |
| మన పుణ్యక్షేత్రాలు | 2 భాగం | ,, | 0.87 |
| ఆనందమందిరం | | తం. పాండురంగశర్మ | 1.25 |
| (పెద్ద సైజులో బొమ్మలతో) | | | |
| న్యాయ తీర్పులు | | పి. సుబ్బారావుశాస్త్రి | 1.00 |
| గోలీకాయలు | | కె. వి. గోవిందరావు | 0.75 |
| మీరూ – నేనూ జట్టు | | రమాదేవి | 0.75 |
| సూర్యం | | కె. సభా | 1.12 |
| కులాసా కథలు | 1–2 భాగాలు | విరించి | 1.26 |
| బాలల బొమ్మల వీరవనితలు | | | 1.50 |

**ఆదర్శ గ్రంథమండలి, విజయవాడ.**

Wrapper Printed at Swatantra Art Printers, Vijayawada-2.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA116B134 |
| పుస్తకం పేరు | మనవదులు 03 |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | [illegible] |
| లేని పేజీలు | 1,2 |
| తయారు చేసినది | A.Swini |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Triveni |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |